# ముత్తెంతో దివ్వెలు



కన్నెకంటి రాజమల్లాచారి

# ముక్తక దీపాలు

(విశ్వకర్మ పంచ శతి)

రచయిత :

"విద్యావిశారద" కన్నెకంటి రాజమల్లాచారి, M. A.

ప్రచురణ :

సరోజా పబ్లికేషన్స్

నరసరావుపేట.

తొలిముద్రణ 1984

ప్రతులు 1000

వెల: రూ 5/-

ప్రతులకు :

ఎస్. అమరనాథ్ B. Com.,

12-14-8. "కవిత"

ప్రకాష్‌నగర్, నరసరావుపేట

గుంటూరుజిల్లా (ఆం. ప్ర.)

ముఖపత్రాలంకరణ

అమర్ & సీను

ముద్రణ:

విశ్వశ్రీ ఆర్ట్ ప్రెస్

నరసరావుపేట

# కృతజ్ఞతలు

ఈ గ్రంథం ముద్రించడానికి రు. 500/- లు బహూకరించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ హైదరాబాద్ వారికీ, రు. 100/- ల చొప్పున సహాయమందించిన

సర్వశ్రీ చిఱ్ఱావూరి నాగభూషణాచార్యులు
బేతపూడి సుందరాచార్యులు
వై. వి. నరిసిరెడ్డి
అత్తలూరి సూర్యనారాయణ
కొండపల్లి సూర్యనారాయణ
శ్రీమతి చెంచమ్మ
(సుప్రసిద్ధ రంగస్థల నటులు అద్దేపల్లి సుబ్బారావుగారి పుత్రిక)
స్వర్ణ వెంకటేశ్వరరావు
చిటిప్రోలు సుబ్బారావు గారలకు

ఈ రచనను ప్రోత్సహించిన మా చెల్లెలు శ్రీమతి సరోజనీదేవికి

కృతజ్ఞతాపూర్వక నమస్సులు

— కన్నెకంటి రాజమల్లాచారి

# సమర్పణ

చదువుల జోలికి నీ వెళ్ళకపోయినా
కవిత్వ తత్వం నీ కర్థం కాకపోయినా
కృతి కన్యల అంతరంగ ప్రకృతి నీకు తెలియకపోయినా
కృతుల బహిరంగాకృతి తెలిసికొని
అడిగినప్పుడు అమరకోశాన్ని అందించావు
పుస్తకాల దొంతరలో దాగిన
భారతాది కృతుల వెదికి అందించావు
మహాకవికి ధర్మపత్నివై ఈ కవి
కుమారునకు మాతృదేవతవై
నీ కవితా కుటీర ప్రాంగణంలో
కమనీయ కవితా లతకు దోహదం చేశావు
అందుకే నా కవితా సురభిళ సుమాలతో
నీ పదపద్మాల నభిషేకిస్తున్నాను.

నాన్నా!

మహాకవివై మహాకావ్యాలు సంతరించావు
కవితాసతి నిన్నాశ్రయించి కష్టాలు పెట్టింది
నీవు తుది శ్వాస వదలిన రోజు
దారిద్ర్య దాస్య శృంఖలాల తెగదెంచిన రోజు
ఇనుపగజ్జెలదేవి ఇరుకునపడింది
దానికి ఇంకా పగతీరక
నాపై విషాగ్ని ధూమాంధకారచ్ఛటల పరపింది
అయితేనేం చుట్టూమూగిన చీకటిని
నా కాంతి హస్తాలతో వెనక్కు చిమ్ముకుంటూ
విజయుణ్ణై వెలుగు ఒడ్డు చేరుకుంటున్నాననే
శుభవార్తతో నా యీ కృతి కుసుమాన్ని
నీ దివ్య పదపద్మాల సన్నిధిన సమర్పిస్తున్నాను.

మార్కాపురం
30-7-84

— మీ కుమారుడు
రాజమల్లాచారి

# విశ్వకర్మ పంచశతి

మొప్రకటి సద్దు మరియు మొదటి రూపమ్మును
నీవు పుడమి గాలి నిప్పు వెలుగు
నింగి యినుడు శశి వెలుం గిడు చుక్కలు
విశ్వమెల్ల నీది విశ్వకర్మ !

2

కడలు లన్ని పొంగి కలిసి పొర్లిన వేళ
రాగిరేకుపైన భోగివోలె
పవ్వళించినట్టి దేవదేవుడ వీవు ॥వి॥

3

బొడ్డులోని తమ్మి పొలుపుగా వికసింప
అందు పుట్టినట్టి యజుడు నతని
పన్ను పనుల మతము లన్నియు నీవయా ॥వి॥

4

వెండికొండపైన వెలసినవాడవు
గుండెగుండెలోన నిండినట్టి
వీరయోగి యనెడి విభుడవు నీవయా ॥వి॥

5

దివసమందు వెలుగు తేజమ్ము నీ సొమ్ము
ఆకసమున తోచు నందమైన
చందమామలోని చలువలు నీవయా ॥వి॥

పలుకు చెలియ పరగ పాడెడి పాటల
తోడిరాగములను తోరముగను
పలుకు వీణ నీదు పనితనమ్మె గదా! ॥వి॥

ఆదిశక్తి రూప మద్భుతమ్ముగ జేసి
ఆమె దాల్చినట్టి ఆయుధముల
అమర జేసినట్టి అమరశిల్పివి నీవు ॥వి॥

8

ఆదిలక్ష్మి నిలుచు అందాల పద్మమ్ము
ఆమె చేతిలోని అంబుజమ్ము
ఆమె ఒడలిపైని ఆభరణము లీవు ॥వి॥

విష్ణుమూర్తి తలను వెలుగు కిరీటమ్ము
అతని గళమునందు నలరు సొమ్ము
ఆత డూదు వేణు వన్నియు నీవయా ॥వి॥

10

బ్రహ్మ తనదు చేత పట్టిన గంటమ్ము
అతడు కూరుచుండు నట్టి గద్దె
ఆతడుండు నూరు నన్నియు నీవయా ॥వి॥

11

అభవు నిటల నయన మండలి నిప్పులు
అతని జటల నుండునట్టి గంగ
అతని వెండికొండ లన్నియు నీవెగా ॥వి॥

12

విష్ణుపతికి గట్టు విపులమౌ మొలనూలు
అతని నొసట నుండునట్టి బొట్టు
అతడాడు నాటలన్నియు నీవయా ॥వి॥

13

పుడమి త్రిప్ప గలుగు ప్రోడవు నీవయా
దానిపైన గల్గు ధర్మమీవు
దాని బ్రతుక జేయు దాతవు నీవయా। ॥వి॥

14

దేవ గణము గురుడు దేవేంద్రు డాదిగా
కలుగు దేవపురము కట్టినట్టి
వాస్తు శిల్పివయ్య వాస్తవముగ నీవు ॥వి॥

15

నింగి బొమ్మ గీచి నీలిరంగును వేసి
చుక్కలు రచియించి చక్కగాను
వాని నడుమ చంద్రవంకను గీచిన
విశ్వ చిత్రకారః విశ్వకర్మ।

16

వేదములను గావ వెన్నుడు తలపగా
అతని వెంటనుండి యాదరించి
చెన్నుమీర నతని చేపగా చేసిన ॥వి॥

17

క్షీర సాగరమును కేరించి చిలుక నా
గిరిని మోయనున్న హరిని జూచి
కూర్మి జేసి తతని కూర్మావతారుగా ॥వి॥

18

అల భువి గొని హిరణ్యాక్షుండు పరుగెత్త
అతని బట్టి నెంచి యరుగు పుడమి
వరుని జేసి తీవు వరహావతారుగా ॥వి॥

19

కాంచ ప్రహ్లాదుని హిరణ్యకశిపు దొగిని
కష్టపెట్టెడి తరుణాన కాచు విధము
నరయు హరి జేసితివి నరహరిగ నీవు
విశ్వ విశ్వేశ సన్నుత విశ్వకర్మ।

20

అరయ బలిరక్కసుం డొగి అమరపురిని
ఆక్రమించిన యప్పుడు నతని మామ
మామ గెలువ దలప వాని వామనునిగ
వేగ జేసిన విదుడవు విశ్వకర్మ।

21

అవని క్షత్రియ క్రౌర్యము నడుప దలచి
అదిదేవుండు సిద్ధమైనట్టి తఱిని
అతని భృగువుగ జేసిన యనఘ చరిత ॥వి॥

22

పాడు రక్కసులు ఋషుల బాధపెట్ట
పాపమని హరి వారి గాపాడ దలచి
యున్నతరి జేసి తతని రామన్న వోలె ॥వి॥

23

అంజనీదేవి గర్భాన నలుక నున్న
అంజనేయుడు గోముగా నడిగినట్టి
వస్తు తతినిచ్చి వానికి వరము లిచ్చి
వెలుగ జేసినవాడవు విశ్వకర్మ.

24

హలము చేతబట్టు బలరాముడవు నీవు
అలగాచు గోపబాలకుడవు
ఇల కహింస జెప్పి వెలుగు సుగతుడవు ॥వి॥

25

విఘ్న మొదవకుండ విఘ్నేశు డవనిలో
భక్త జనుల కొసగు ముక్తిపథము
అట్టి గుజ్జు వేల్పు నమర జేసితివయా ॥వి॥

26

కేశవుడ వీవు విజయ సంకేత మీవు
కాంచ కపిరాజ కేతన కలితమూర్తి
విమల కల్క్యవతారము నీవ దేవ ॥వి॥

27

నారసింహ వీరనారాయణుడ వీవు
విష్టరశ్రవుడవు విధుడ వీవు
విష్ణుమూర్తి వీవు జిష్ణుమూర్తివి నీవు ॥వి॥

28

మాధవుండ వీవు మాన్యుడ వీవెగా
మహిమ మాయ మనీషి మనసు వీవె
మంత్ర తంత్రములును మరి నీవె తలపగా ॥వి॥

29

గోప బాలకుడవు గోవిందుడవు నీవు
వేణుగాన లోల విక్రముడవు
వనశమాల గన్న వనమాలి వీవయా

30

విష్ణుమూర్తి కున్న విక్రమమ్మే నీవు
పుణ్డరీకుని బహు పుణ్య మీవు
చక్రి చేతనున్న చక్రాయుధము నీవు

31

మాపతి హరి సౌరి మధుసూదనుండన
సర్వ నామధేయ సహితు డగుచు
అవని భరము దీర్ప నవతరించితివయా

32

అల త్రివిక్రముం డాదిగా గల దివమ్ము
నందు నున్నట్టి సుందర మందిరముల
నలరు రమ్యాతి రమ్యమౌనట్టి శిల్ప
విద్య లన్నియు నీవయ్య విశ్వకర్మ ॥వి॥

33

వామనుండ వీవు వందనమ్ములు సామ
గరుడ కేతనుడవు కైటభారి
వచ్యుతుండవు నిఖిలాండకోటివి గదా॥ ॥వి॥

34

శ్రీధరుండవయ్య శ్రీవరుండవు నీవు
సర్వ వేద సార సముడ వీవు
నిఖిల జగములందు నిండియుంటివి గదా ॥వి॥

35

శ్రీపతి మురవైరి శ్రీహృషీకేశవా!
పీతవసన శౌరి పీన వక్ష
ఇందిరా ప్రియ గొను వందనమ్ములు స్వామి! ॥వి॥

36

వైనతేయ దివ్య వాహనమ్మును గల్గు
పద్మనాభ దేవ పద్మనయన
పన్నగ శయన నిను సన్నుతింతును దేవ ॥వి॥

37

పాంచజన్య మూదు పరమున నీవయ్య
అంబుజాక్ష వరద ఆదిదేవ
విధుడవయ్య సకల విశ్వంభరుడ వీవు ॥వి॥

38

స్మర జనక సిరివర సంకర్షణా నమో
లోకమాత నేలు లోకనాథ
శంఖ చక్రధారి శార్ఙ్గమ్ము నీదయా ॥వి॥

39

పంచ శరుని తండ్రి ప్రద్యుమ్నుడవు నీవు
యజ్ఞ పురుష డీవు యజ్ఞ మీవు
నందకమ్ము నీది నందనందన నతుల్ ॥వి॥

40

అనఘ చరిత గల్గు అనిరుద్ధజయమయ్య
కాంచ నాంబరమ్ము గట్టువాడ
పుండరీక వరద పూరుషోత్తమ నతుల్ ॥వి॥

41

శ్రీయధోక్షజ హరి శ్రీవత్సలాంఛనా
కంస దమన దివ్య కాలపురుష
నారసింహ! వరద! నారాయణా నతుల్ ॥వి॥

42

కౌస్తుభ మణి మరియు కౌమోదకమ్మును
నీదు సృష్టిగాద నిర్మలాత్మ
అచ్యుతా నమస్సు ఆదిదేవ నమస్సు! ॥వి॥

43

శ్రీవర మురవైరి దేవతాధీశ్వరా!
శంబరారి గన్న శార్ఙ్గి నతులు
విశ్వరూపధారి విశ్వేశ సన్నుతుల్ ॥వి॥

44

శ్రీప్రదమ్ము గాద శ్రీయుపేంద్రా నీదు
రూపమహము పొలి రూక్షణమ్ము
సిరి వర హర శౌరి శ్రీకృష్ణ గిడిగిళ్లు ॥వి॥

45

వెలుగు లన్ని నీవు వేదాలు నీవెగా
వాని నుద్ధరించు వాడవీవు
వాని నిలువ జేయువాడవు నీవయా ॥వి॥

46

పల్లెనాటి యందు బరగెడి తక్కెళ్ళ
పాడనియెడి పురము చూడ మాకు
జన్మభూమి సామి జగదంబుగల భూమి ॥వి॥

47

కన్నెకంటి వారు కలరయ్య పలనాటి
కావ్యకళల కలియు కలుగువారు
వార వంశమందు వాసికెక్కిరి కవుల్
విన్న వింతునయ్య విశ్వకర్మ ।

48

ఘనులు పలనాటి సోదర కవులనంగ
పరగు ప్రభులింగ చినలింగ భద్రకవులు
అందు చినలింగకవికి నే ననుగు సుతుడ
విన్నపములయ్య విశ్వేశ విశ్వకర్మ ।

49

జాను తెనుగు నుడివి జాలువారించి బల్
కమ్మ కమ్మనైన కవిత అల్లి
పలుకు చెలికి గూర్చె పసిడి యాభరణముల్ ॥వి॥

50

కన్న తండ్రి నాకు కాదు రమణారెడ్డి
మున్న యంత కన్న నన్ను పెంచి
పెద్ద జేసినట్టి పెన్నిధి యతడయా ॥వి॥

51

పంచ ముఖములు గల పరమ పురుషుడవు
పంచశతిగ పద్యమెంచి రచన
చేయ దలచినాడ చేకొనుమో స్వామి
వినతులయ్య నీకు విశ్వకర్మ

52

నన్నె చోడుని కవితలో నాణెమీవు
శబ్ద శాసని కావ్యపు శైలి నీవు
కవి యుధర్వణాచార్యుని ఘనత నీవు
విశ్వకవి చక్రవర్తివి విశ్వకర్మ ।

53

పండితారాధ్య పాండితీ పటిమ నీవు
సోమనాధుని కబ్బపు సొగసు నీవు
శైవకవుల జాను తెలుగు శైలి నీవు ॥వి॥

54

కనకాభిషేకాలు కలిగిన యాతడు
కలుముల శ్రీనాథ కవివరుండు
శ్రీరాము పాదాల చిత్తాన నిల్పిన
కవితల పోతన్న కర్షకుండు
రక్తికై యాతడు రచియించె నొప్పుగ
నైషధమును విద్వదౌషధమున
ముక్తికై యాతడు మునుచెప్పె తీయగ
భాగవతము భక్తి బంధురముగ
హాలము పట్టియోడె నిలను శ్రీనాధుండు
కలము పట్టిగెలిచె కర్షకుండు
అతని యితని కవితలన్నియు నీవయ్య
విశ్వకవివి నీవు విశ్వకర్మ!

55

తిరుమలేశుని ఘన దివ్యపాదాలపై
పదము లల్లి పరమపదము గనెను
అన్నమయ్య కృతుల అందాలు నీవయ్య ॥వి॥

56

భువన విజయమందు భూరియశము గన్న
ఆంధ్ర కవుల తాత అల్లసాని
అల్లిక జిగి బిగుల అందాలు నీవయ్య ॥వి॥

57

గడియ కొక్కనూరు కావ్యాలు రచియించు
రుద్రకవికి సాటి రుద్రకవియె
భువన విజయమునకు కవన విజయమిచ్చె ॥వి॥

58

వికట కవి తెనాలి విమల వంశస్థుడు
రవిని మించినట్టి రామలింగ
డతడు నీదుపేర్మి యన్వయ దీపమ్ము ॥వి॥

59

రాజకవి కృష్ణ రాజాంధ్ర భోజుడయ్యె
రాజు రఘునాథు డభినవ రాయడయ్యె
రాజ కవిశేఖరుల కావ్య తేజమీవు
విశ్వకవి చక్రవర్తివి విశ్వకర్మ

60

మువ్వ గోపదాలు మురిపాల లీలలు
జానపదుల మృదుల జావళీలు
క్షేత్రసుకవి మధుర కీర్తనలే నీవు
విశ్వకవివి నీవు విశ్వకర్మ

61

తేటగీతికి నేర్పెను తేట తెనుగు
ఆటవెలదికి నేర్పెను ఆటలెన్నొ
వేమకవి కావ్య వేదాంత విధము నీవు
విశ్వకవి చక్రవర్తివి విశ్వకర్మ

62

వీర గురుడు కాల విజ్ఞానమును దెల్ప
అభ్యుదయ కవీంద్రు డతడు నాడె
దేశికుండ మరియు దేవుడాతండయా
విశ్వ ధారకుడవు విశ్వకర్మ

63

గద్య తిక్కనని బరువపు ఘనత గన్న
పంతు సంస్కర్త యుగకర్త సర్వశాస్త్ర
వేత్త వీరేశలింగమన్ వెలుగు నీవు
విశ్వ సంస్కర్త వీవయ్య విశ్వకర్మ.

64

కవుల చిలకమర్తి ఘను దక్ష్యుదయములో
వనుపడించు టందు నధికుడైన
కృష్ణమూర్తిశాస్త్రి కృతులె చెప్పగవలెన్
విశ్వకవివి నీవు విశ్వకర్మ.

65

చెళ్లపిళ్లశాస్త్రి చెన్నగు కవితలో
తిరుపతికవి పాండితీ ప్రకర్ష
జంటకవులు కృతుల పంట పండించిరి. ॥వి॥

66

గద్యకవిత కాదిఘనుడు చిన్నయసూరి
ఆతని శిష్యుడంత కంటె ఘనుడు
గ్రాంథికమున బ్రతికె కొందగా కొక్కొండ ॥వి॥

67

అక్కిరాజు నేటి యాంధ్ర కావ్య విమర్శ
లోన క్రొత్తబాట తొలివేసె
ఆంధ్రభాష నాతదర్శించె ఘనముగా ॥వి॥

68

వ్యావహారికమును వ్యవహరింపగ జేయ
పిడుగు వోలె పడెను గిడుగుమూర్తి
తెలుగు బాస కతడు వెలుగు బాటలు వేసె ॥వి॥

69

అరుగు జాడవేసె నానాడు గురజాడ
ముత్యముల సరాల ముడులు వేసి
ఇంపుమీర కవుల కీనాటి కది జాడ

70

కృష్ణశాస్త్రి భావకవితల వెలయించి
తెలుగు నేలపైన వెలుగుచుండె
భావకవుల యందు భాగ్యరాశి యతండు

71

రెండుశ్రీలు కల్గి రెండుపెగ్గులు తాగి
విప్లవ రచనల విరివి జేసి
విప్లవ పథమందు వీరుల నడిపించు
శ్రీనివాసరావు చెయిద మీవు.

72

అంత్యమందు ప్రాస ఆరుద్రకవి ముద్ర
దాశరథి కవీంద్రు నాశయాలు
సింగిరెడ్డి కావ్య సింగారములు నీవు .

73

అభ్యుదయ పథాన నాతండు నడిచెనా
విశ్వనాథ కవికివిపిలువ పెరిగి
ఆంధ్రకవిత కెలమి యంతస్తు కల్గదా

74

వఖము నీదు గొడుగు శుభముగా వర్షింప
పుడమి మేలిగద్దె పులకరించి
పంట పండ ప్రజలు పంచుకొందురుగాక ।
విశ్వధారకుడవు విశ్వకర్మ

75

ఎక్కు తక్కు వనెడి లెక్కలు తొలిగించి
పంచలోహములను పంచినావు
ఆస్తి జాతులన్ని యల్లుకుపోవలెన్
విశ్వ ధర్మమర్మ విశ్వకర్మ

76

భాగ్యవంతులనెడి భావమ్ము పోకార్చి
పేద జనులకున్న బాధదీర్చి
మిట్ట పల్లములను కొట్టివేయుము స్వామి ||వి||

77

చెట్లు పండ్లతోడ చెలువమ్ముగనుగాక
ప్రజలు మితపు సంతు గల్గి యుండి
విశ్వమందు ప్రేమ విలసిల్లెడినిగాక ||వి||

78

ఏడు రంగులేసి యేర్పడ చక్రమున్
వడిగ త్రిప్ప నొక్క వర్ణమట్లు
తిరుగునట్లు భువిని త్రిప్పవా వడితోడ ||వి||

79

పాదపీఠి తనకు పావనమ్మగు లంక
రత్నగర్భయైన రమణి భరత
ధాత్రి శిరముపైన ధరియించు కాశ్మీరు
వెలుగు మండనమ్ము విశ్వకర్మ.

80

పాడి పంటగల్గు పావన దేశమ్ము
భుక్తి ముక్తి నిచ్చు పుణ్యురాలు
భరతమాత కున్న భాగ్యమే భాగ్యమ్ము ||వి||

81

గుళ్లు గోపురాలు గుణమైన పురములు
కాపురములు కలుగు కర్మభూమి
భరతధాత్రి కన్న భాగ్యరాశియె లేదు . ॥వి॥

82

కావ్య కళల కలిమి కల్గినఘనులైన
కవులగన్న తల్లి కల్పవల్లి
భరతధాత్రి కళల భాగ్యమే భాగ్యమ్ము

83

గాన సుధలు జిలుకు కమ్మని కంఠాల
గాయకులను గన్న గణ్యరాలు
భరతమాత కళల కలిమియే కలిమియా ॥వి॥

84

నాట్యమైన నటన నందించు సహజమౌ
నటుల గన్న యట్టి నాగవల్లి
భరతమాత కళల కలిమియే కలిమియా ॥వి॥

85

గంగ యమున పెన్న తుంగభద్రా నదుల్
చెంగలించుచుండ చెలగునేల
భారతాంబ కన్న భాగ్యరాశి ఎవరు ? ॥వి॥

86

రాళ్లలోన పాట రవళింప జేసెడి
శిల్పులున్న దివ్య శిల్పశాల
భరతభూమి కన్న భాగ్యరాశి గలదె ॥వి॥

87

రజతగిరియు మరియు రమ్యమౌ పర్వత
శ్రేణిగల్గు భూమి శ్రేష్ఠభూమి
భారతాంబ కన్న భాగ్యరాశి ఎవరు ? ॥వి॥

88

తేట తేనె వంటి తెలుగు బాసాడెడి
మనుషులున్న దివ్య మందిరమ్ము
ఆంధ్రమాత కన్న నధికులెవ్వారయా ॥వి॥

89

అన్నపూర్ణయామె అఖిలభారతమున
కనుపమానమైన దామె కరుణ
తెలుగు నేలయందు వెలుగు కీర్తిజ్వాల ॥వి॥

90

తుంగభద్ర కృష్ణ తోయమాలికలతో
పసిడి పండునట్టి పంటభూమి
ఆంధ్రజనని కన్న అధికులెవ్వారయా ॥వి॥

91

గొప్పకూరయన్న గోంగూరనే చెప్పు
ఆంధ్రశాక మద్ది యరసిచూడ
తెలుగు జనత మెచ్చు తీయని చవినిచ్చు ॥వి॥

92

పాట పాడుమన్న పాడు తెల్గులపాట
తీయనైన పాట తెల్గుపాట
పంచదార వంటి పాట తెల్గులపాట. ॥వి॥

93

నీలి నింగిలోన నెగిరెడి పక్షుల
మబ్బుల గుమిపైన మాలవోలె
అందమైన చిత్ర మంవోకగా వ్రాయు
విశ్వ చిత్రకార విశ్వకర్మ

94

కొండ నుండి దూకు నిండు ప్రవాహాలు
పూలతీవెలున్న పొదల సొబగు
జగతిలోని అందచందాలు గీచెడి ॥వి॥

95

తెల్లరంగు పగలు నల్లరంగగు రాత్రి
నలుపు తెలుపు బొమ్మ వెలుగు జగతి
కుంచె చేతబూని కువలయ చిత్రమ్ము
వేయు చిత్రకార! విశ్వకర్మ:

96

స్వర్గ భూమికన్న భార్గవికన్నను
జన్మభూమి మరియు జనని మిన్న
జన్మభూమి నాకు జయమైన పలనాడు.
విన్నవింతునయ్య విశ్వకర్మ!

97

పెట్టినట్టి కోట లట్టునుండును గిరుల్
పేట పేట లందు కోటలుండు
పల్లెనాటిసీమ చల్లనౌ గృహసీమ ॥వి॥

98

పుట్టె నిచట కవిత పుట్టి రిచ్చట కవుల్
పుట్టె సమత మమత పుట్టె నిచట
పుట్టి రిచట వీరపురుషులు వనితలు ॥వి॥

99

పుట్టె నప్పకవియు పుట్టెను సూరన్న
పుట్టె నిచట సుకవి భట్టుమూర్తి
పుట్టె నక్కిరాజు పుట్టిరెందరొ కవుల్ ||వి||

100

మగని యుద్ధమునకు మాంచాల పంపెను
నాగమ తొడగొట్టె నాలమందు
వీర ముగ్గులేసినారు నారు లిచట ||వి||

101

బాలచంద్రు డిచట పదను కత్తులు దూసె
బ్రహ్మనాయ డిచట పరిఢవిల్లె
వీరవరులు పుట్టినారు పల్నాటిలో ||వి||

102

నాగులేరు పారు నా జన్మభూమిలో
చలువనీటి నిచ్చు చంద్రవంక
గంగ యమున లట్లు పొంగెడి నదులివ్వి ||వి||

103

చెఱకు తోటలిచట చిగురించుచుండును
అకుతోటలుండు నవిరళముగ
పంట పూవుబోణి పల్నాటి మాగాణి ||వి||

104

నవరతనపు దండ నాగార్జునునికొండ
సిరులు దొర్లు దివ్య శిల్పశాల
నందికొండ వేసె నందనవనములు ||వి||

105
సిరులకవితలల్లు శ్రీనాథకవిరాజు
తిక్కనకవివోలె తెల్గునందు
పల్లెనాటి వీర భారతమ్మును జెప్పె ॥వి॥

106
మహిమ గల్గునట్టి మాచెర్ల చెన్నుండు
బొడ్డుమల్లయ బలుదొడ్డసామి
గొప్పమహిమలున్న గురజాల భద్రుండు ॥వి॥

107
గార పాడుపేర గ్రామమొక్కటి గలదు
పల్లెనాట నద్ది పల్లెటూరు
రామలింగకవికి ధామమిద్దియెగదా! ॥వి॥

108
పొంగి చంద్రవంక చెంగున చెంగున
ఉత్తరముగ సాగి ఉత్తరమున
ఎగిరిదూకులోయ నెత్తిపోతల యంద్రు ॥వి॥

109
లోయలోన పద్మలోచనమ్ములవాడు
రంగనాథస్వామి రాణతోడ
పవ్వళించియుండు పాపరేనిపయిన ॥వి॥

110
కడిమిపూల మీది కమ్మని వాసనల్
కలుపుకొని పడమటి గాలివీచు
వర్షఋతువునందు హర్షమ్ము కలుగును ॥వి

111

అందుగు వరిమద్ది అడవిమొల్ల కడిమి
పట్టగొడుగు మొగలి పూలుపూయు
వర్ష ఋతువు జూడ హర్షమ్ము గలుగదా! ॥వి॥

112

నీలినింగి యందు నీరదాల్ పరుగెత్తు
కొండమల్లె పూలు కొలదిపూయు
వర్ష ఋతువు నందు హర్షమేమని యందు ॥వి॥

113

ఆర్ద్ర పురుగు లిపుడు అందమై యుండును
చాతకములు మొగల దాచుచుండు
వర్ష ఋతువు వలన హర్షమ్ము గలుగదా? ॥వి॥

114

వేయిగతుల క్రొవ్వు వెన్నెల పులుగులు
నెమ్మినాడు క్రొవ్వి నెమిలి పిండు
వర్ష ఋతువు నందు హర్షమేమని యందు ॥వి॥

115

గోండ్రుకప్ప లిపుడు గొప్పగా బలియును
కనగ లేళ్ల నీటికాకులుండు
వర్ష ఋతువు నందు హర్షమేమని యందు ॥వి॥

116

మిడిసిపడెడి ధూళి యణగిపోవు నిపుడు
పర్వతములు కడుగబడుచు నుండు
వర్ష ఋతువు నందు హర్షమ్ము కలుగదా? ॥వి॥

117

ఒడ్డు లొరసి నదులు ఒనరగా ప్రవహించు
గట్లు తెగుటకూడ కలుగు నొకట
మన్ను మిన్ను లొక్క-టెన్నన గన్పట్టు ॥వి॥

118

నాటకముల నాడు నటులకీ సమయాన
నట్టు గలుగు చుండు నటనమందు
వర్ష ఋతువు నందు వారికి కష్టాలు ॥వి॥

119

మేఘ మందిరాల మెరపుతీవియలాడు
గాలి వాన రెండు గలసి వచ్చు
వాన గురియ నొకట వడగండ్లు రాలును ॥వి॥

120

వాన గురియు నంత వాగులు పారును
అందులోన పిల్లలాడుకొనుచు
వర్షమందు వారు హర్షమందెదరయ్య ॥వి॥

121

వాగులోన సాగు కాగితపు పడవ
లపుడు పిల్లలెగరి యాటలాడి
వర్షమందు తడిచి హర్షమ్ము పొందేరు ॥వి॥

122

వానలోన తడువ వద్దురా నాతండ్రి
జలుబు చేయు నంచు జబ్బపట్టి
ఈడ్చు కొనుచు పోదు రింతులు పిల్లలన్ ॥వు॥

## 123

నీళ్ల గుంటలందు నిలిచి చేతుల కాళ్ల
చిమ్మివేయుచుంద్రు చిన్నవారు
పయినబడిన వారు పలుమాట లందురు ॥వి॥

## 124

వాన చినుకు లట్లు వర్షపు నీటిలో
పడుచునుండగ కనుపడు నూనె
లో పకోడి వేయు రూపమై కనులకు

## 125

ముడిచి మూలనున్న గొడుగు లన్నియు లేచి
తడిచి గుంపుగట్టి తరలుచుండు
నింగి విడిచి మబ్బు నేలబడినయట్లు ॥వి॥

## 126

వాన యెవుడు వచ్చు ప్రాణ మెప్పుడు పోవు
ననెడి మాట చెప్పమన్న నెవరు
తెలుప గల రనుచును పలుకుచుంద్రు నరులు ॥వి॥

## 127

ఒదుగు నెండకైన నోర్చుకొందురుగాని
ఒక్క చినుకు పడిన ఓర్వలేరు
మనిషి యోర్చు చెడును మంచి నోర్వగలేడు ॥వి॥

## 128

ఉత్తరమున మెరిసి ఉరిమిన చాలును
గాలివీచ రాలు పూలవాన
భూమి తడిచి నపుడు పుట్టు కమ్మని కంపు ॥వి॥

## 129

తోరణములు గట్టు తూనీగ గుంపులు
ఆకసాన నుసిళ లాడుచుండు
కప్ప లరచుచుండు గరరవరట్టని ॥వి॥

## 130

పల్లెప్రజల గుండె పల్లవించుచు నుండు
పొలము లెల్ల తడిచి బలము పొందు
వర్షఋతువు నందు వారి కానందమే ॥వి॥

## 131

నోళ్ళు విచ్చినట్టి బీళ్ళ దాహము తీరు
నీళ్ళు పారి నంత నేల తడిచి
ఆకుపచ్చరంగు నంతలో పొందును ॥వి॥

## 132

గుడిశలోనివారు తడిచిపోవుదురయ్యా
మేడలోనివారి మేలు కేమి?
కాలు తడవకుండ కాపురముందురు ॥వి॥

## 133

రెక్కలాడకున్న డొక్కలాడనివారి
చిక్కు లేమి చెబుదు లెక్క లేవు
వర్షఋతువు నందు వారికి కష్టాలు ॥వి॥

## 134

కట్టెలన్ని తడిచి కణకణ మండవు
ఊది యూది దవడ లూడిపడును
పొయ్యి మండ దిపుడు పొలతికి కష్టాలు ॥వి॥

135

అన్నముడుకు టదియె అంతంతమాత్రమ్ము
కూర జేయునట్టివారు గలర?
అవకాయ లేద? అప్పుడప్పుడు వాడ? ॥వి॥

136

వారమంత విడని వానముసురు బట్ట
ఇంటి నిండ నున్న నేమి బాధ
ఇంట నిండుకొన్న నిక్కట్లు గలుగవా? ॥వి॥

137

జాన బలుసు పండ్లు జాస్తిగా వచ్చును
తుమ్మిపండ్లు మరియు నెమ్మిపండ్లు
ఊటి చిటిముటియును ఒనరగా వచ్చును ॥వి॥

138

పచ్చచీర గట్టు పడతియో అన్నట్లు
ధరణి పులకరించి దరహసించు
నింగి కనులు మెరిసి పొంగు సంతసములు ॥వి॥

139

కుంటలన్ని నిండు పంటకాల్వలు పారు
చేప లందులోన చెంగుమనును
వాని బట్టువారు వలబట్టి చనుదెంత్రు ॥వి॥

140

అరుబయట జనులు ఆదమరచియుండ
వాన వచ్చు దొంగవానివోలె
ఇంటిలోని కేగ నిక యుక్కపోయదా? ॥వి॥

141

చెరువునిండు మరియు దొరువులు నిండును
రైతుమనము కదలు రైలువోలె
హలముబట్టి సాగు పొలము దున్నగ నెంచి ॥వి॥

142

వాగు లొక్కసారి వేగమ్ముగా పార
రోడ్లు తెగును రైలు రోడ్లు తెగును
ఎక్కడున్న బండ్లు అక్కడే ఆగును ॥వి॥

143

ఆకసమున విరియు నందాల హరివిల్లు
తోన వచ్చిహాలు వానజల్లు
పొంగి నేల యేకభంగిని తోచును ॥వి॥

144

తలకబోసికొన్న తరుణీ జనమ్మన
చెట్లు తడచియుండు చెలువుమీర
గువ్వ గూటిలోన కువకువ లాడును ॥వి॥

145

చలనచిత్ర మందిరాలు జనులు రాక
నిండకుండు డబ్బులుండకుండు
కాఫి హోటళులకు కలుగును లాభముల్ ॥వి॥

146

అడుసు త్రొక్కి కాలు కడుగనేల యటన్న
పాతపాట నిపుడు పాడరాదు
అడుసు త్రొక్కి కాలు కడుగని దెవ్వరు? ॥వి॥

147

అవని యందు జనులు ఆషాఢమాసాన
పేలపిండి గొట్టి చాల పెద్ద
సంబరమ్ము చేసి సంతసం పడుదురు ॥వి॥

148

భాద్రపదము నందు పరగ శుద్ధ చవితి
నాడు ప్రీతితో వినాయకునకు
పూజచేసి జనులు పుణ్యు లయ్యేదరయ్య ॥వి॥

149

ఉడుపథమ్ము నందు ఉరుమురిమినయంత
అర్జునా ఫలుగుణ పార్ధయనెడి
అతని నామ తతిని యనుకొనుచుందురు ॥వి॥

150

కామినీ మణులును కాముకులు గలిసి
చిన్నతోటలందు చెలువుమీర
కూడి యాడి పాడి కులుకుచుండెదరయ్య ॥వి॥

151

ఆకస మను బొంకు నందు దాచినయట్టి
కంకణములు మరల కదలి తీసి
కొన్నయట్లు వాన కురియును సంద్రాన ॥వి॥

152

ఎరువు బండ్ల మీది కెత్తుచు రైతులు
పొలము కడకు కొనుచు పోవుచుంద్రు
ఏరువాక సాగు నేర్పాట్లు సేతురు ॥వి॥

## 153

సీతు లింకిపోవు నిరుపేద కన్నుల
సరసులందు పూయు సరసిజములు
అట్టి మంచి ఋతువె అరుదెంచు మునుముందు ॥వి॥

## 154

నీరు విడిచి యంచ క్షీరమానినయట్లు
తేటి పూలవాలి తేటతేనె
త్రావు నట్లు మంచిదారి నే నెంచెదన్ ॥వి॥

## 155

పుట్టు వెచట నున్న గిట్టు టచ్చట నుండు
చావు గల్గు నను విచారమేల
పుట్టి గిట్టు టెల్ల పుడమిలో సాజమ్ము ॥వి॥

## 156

పూల దేమి కులము పులుగు దేమి కులము
మట్టి దేమి కులమొ మనిషి దదియె
అట్టి కులము నాది యనుచు చాటెదనయా ॥వి॥

## 157

మాసినట్టి వలువ మార్చివేసి మరల
తెల్లగుడ్డ కట్టు తెరగు నరుడు
పూర్ణ దేహము గొను జీర్ణ దేహము డుల్చి ॥వి॥

## 1^8

కర్మ జేయ జనత కధికారమున్నది
కలుగరాదు కోర్కె ఫలమునందు
కాన నరు దనయము కర్మ జేయవలెను ॥వి॥

159

యజ్ఞ విధులు నీవు యజ్ఞ పురుష మీవు
యజ్ఞ భుక్కు నీవు యజ్ఞ మీవు
హోమవేది నీవు హోత్రివి నీవయా ॥వి॥

160

సర్వ జగతి యందు సర్వేశ్వరుండుండు
అతడు నాశ రహితమైనవాడు
అవ్యయమగు వాని కంత మెక్కడిదయా ॥వి॥

161

నీరు తడప లేదు నిప్పు కాల్చగ లేదు
గాలివలన నెండ జాల దాత్మ
ఆయుధమ్ము లెవ్వి అంతమొందింపవు ॥వి॥

162

కనుల కాత్మ యెపుడు కనుపించగా రాదు
మనసులోననైన మనల చెందు
చేతబట్టి చూడ చిక్క డీ యాత్ముండు ॥వి॥

163

తనదు నవయవాలు తాబేలు కుంచించు
నట్లె యోగికూడ అవనిలోన
ఇంద్రియముల బట్టి యిగ్గును వెనుకకు ॥వి॥

164

కోర్కె గలుగ దాన కోపమ్ము పుట్టును
దాన వచ్చు తెలివి లేనితనము
దానివలన బుద్ధి నాశమ్ము గల్గును ॥వి॥

165

అరయ గొప్పవారి యాచారముల నెల్ల
లోకు లాచరింత్రు లోకమందు
అందుకొరకె వార లాదర్శ జీవిత
విధిని గడుప వలెను విశ్వకర్మ!

166

ధర్మమునకు గ్లాని ధరణిలో కలుగగా
అవతరింతువయ్య అట్టితరిని
శిష్ట జనుల గావ శిక్షింప దుష్టుల
విశ్వ ధర్మ మర్మ విశ్వకర్మ!

167

నాల్గు వర్ణములును నాచేత సృజియింప
బడిన వనుచు నీవు పలికి జనులు
చేయు పనులబట్టి చేసితివి కులాల ॥వి॥

168

తామరాకు నీట తడువని రీతిగా
పాప మంటకుండు పరము నమ్మి
అన్ని కర్మ లతని కర్పించువానికి ॥వి॥

169

మితము గల్గు తిండి మితము గలుగు నిద్ర
మితము గల్గు కర్మ మిత విహార
ములను గల్గువాని ముందుండు యోగము ॥వి॥

170

ఆత్మలోన ధ్యాన మమరియుంచిన చాలు
చిత్తముండగలదు చిన్మయముగ
గాలి లేనిచోట గ్రాలు దీపమువోలె ॥వి॥

171

బ్రహ్మ మార్గమందు పట్టుపడలువాడు
గాలి కెగురు మేఘమాల వోలె
నరుడు పరము నిహమునకు దూరమగునయా ॥వి॥

172

నీవు లేక లేదు నిఖిల ప్రపంచమ్ము
దండలోన దాగు దారమట్లు
ఇమిడియుండె జగతి యిమ్ముగా నీలోన ॥వి॥

173

జల రుచి వలె సూర్య చంద్రుల వెల్గట్లు
వేదమందు ప్రణవ నాదమట్లు
నింగి యందు సద్దు భంగి నీవుంటివి ॥వి॥

174

బ్రహ్మ విద్య గల్గు బ్రాహ్మణుని యెడల
గోవునందు మరియు కుక్కయందు
ఆదరమ్ము చూపు నట్టివాడే జ్ఞాని ॥వి॥

175

ఎవడు కర్మ జేయు నే ఫలమాశింప
కట్టివాడె యోగి యగును భువిని
అగ్నిహోత్రియైన నంత యోగియెకాడు ॥వి॥

176

అగ్ని వెలుగు పగలు నల శుక్లపక్షము
ఆరునెలల ఉత్తరాయణమ్ము
పోను మార్గమందు పోవు వాడిల బ్రహ్మ
వేత్తయగును భువిని విశ్వకర్మ.

177

పరగ రాత్రి కృష్ణపక్షమ్ము పొగయును
ఆరునెలల దక్షిణాయనమ్ము
పోవు మార్గమందు పోవువాడు మరల
విశ్వమందు ప్రట్టు విశ్వకర్మ

178

అగ్ని ఆజ్యములును ఔషధమ్మును నీవు
హోమ కుండ మీవు హోమ మీవు
మంత్ర తంత్రములును మరినీవె కావయా ॥వి॥

179

తల్లి గురువు నీవు తండ్రివి నీవయా
దాత వీవు మరియు తాత వీవు
ఒప్పు వేదతతులు ఓంకారమును నీవె ॥వి॥

180

పత్ర పుష్పములను ఫలమైన జలమైన
భక్తితోడ నొసగు భక్తవరుల
కవిరళముగ మోక్ష మందజేసెదవయ్య ॥వి॥

181

విద్దె గల్గువాడు వికృతుం డైనను
ఆదరింతు రతని నఖిల జనులు
వట్టివేళ్ల వంక వాసన దీర్పదా? ॥వి॥

182

చదువు రానివాడు చక్కనివాడైన
అదరింపకుందు రతని నెపుడు
మోదుగుపువు నెవరు మూర్కొనువారలు ॥వి॥

183

మంచివాని చెలిమి మంచిని కలిగించు
చెడ్డవాని చెలిమి చేటు దెచ్చు
నేల గుణము బట్టి నీటి రుచులు మారు ॥వి॥

184

మంచి మాటలాడు మనిషిని మర్యాద
చేసి యాదరింత్రు చెలిమి నెరపి
పలుకు లొలుకు మంచి చిలుకను పెంచరా ॥వి॥

185

చెడ్డ మాటలాడు చెనటిని దూషించి
చీదరింత్రు వాని చేర రెవరు
కాకి కేగ వినగ లోకుల కిష్టమా? ॥వి॥

186

బలము కలుగువాడు పైబడ వంగిన
వానికెట్టిదైన హాని గలదె?
తీగె వంగియున్న వాగేమి చేయును? ॥వి॥

187

బలము కలుగువాడు పైబడ నెదురించు
వాని కిలను గలుగు హాని మిగుల
తాటి వంగకున్న నేటి పాలవు గదా! ॥వి॥

188

గొప్ప వంశమందు గురుతుగ పుట్టిన
గుణము లేనివాని గూడ రెవరు
చెఱకుపూల నెవరు చేకొనువారలు ॥వి॥

189

ఎన్న కులమునందు చిన్నవారైనను
గుణము గల్గువారె గొప్పవారు
మల్లెపూల గుంపు ఉల్లాసముల నింపు ॥వి॥

190

మొక్క నాటి నీళ్ళ నొకనాడు పోయుచో
తాటి ఫలము లిచ్చు తరతరాలు
మంచివాని కొక్క మంచి చేసిన నంతె ॥వి॥

191

మొక్కనాటి నీళ్ల నొకనాడు పోయమా
పోకమాను ఫలము పొందలేము
చెడ్డవాని కొక్క చెడ్డ జేసిన నింతె ॥వి॥

192

అవని యోగ్యుడైన నతనికి దానము
చేయ ఫలము దానిచేతగలుగు
ఆలిచిప్ప బడగ వల చిన్కు ముత్యమౌ ॥వి॥

193

అవని గుణము లేని యతనికి దానము
చేయ ఫలము దానిచేత లేదు
మురపనేల పైన కురిసిన చినుకట్లు

194

గొప్పవాని కెంత ముప్పు వచ్చినగాని
గొప్పఫలము పొంద గోరునతడు
ఏన్గు తలను గోరు నెపుడు హర్యక్షమ్ము ॥వి॥

### 195

హీన గుణము గల్గువానికి యిసుమంత
మేలు గల్గినంత చాలుననును
ఒక్క ఏముక చిక్క కుక్క కెక్కువ గదా ॥వి॥

### 196

ధనము గల్గువాడు దానమ్ము చేసినన్
వెల్గు దాన లేమి కలుగబోదు
సానబట్ట రత్నమున కాంతి పెరుగదా ॥వి॥

### 197

భాగ్యవంతుడైన పండితుడైనను
చెనటియైన వాని చేర రెవరు
అహినిగూడ రెవ్వ రందాల మణిజూచి ॥వి॥

### 198

అధికుడైన మనుజు డల్పుని చేరిన
హీని వలన చెడును వాని ఘనత
తెప్ప పయిని రాయి తేలిన యట్టుల ॥వి॥

### 199

అల్పుడైనవాడు నధికుని చేరిన
వీని వలన పెరుగు వాని ఘనత
చీమ శివుల గూడి శివునిపై కెక్కదా? ॥వి॥

### 200

సిరులు గల్గువాని చేరుదు రందరు
పొగడుమంద్రు వాని పొంత జేరి
చెరువు నిండిన యంత చేరు కప్పలయట్లు ॥వి॥

## 201

ధనము లేనివాని దాపు కెవ్వరు బోరు
చీదరించు చుంద్రు పేద యనుచు
చెరువు లెండియున్న చేపలు చేరునా? ॥వి॥

## 202

తినడు తాను పరుల తిననీయకుండును
పాపి సొమ్ము పరుల పాలవంగ
తేటి తేనె గూర్చి తెరువరి కొసగదా? ॥వి॥

## 203

మంచిరూపు జూచి మంచివాడనరాదు
పనులు తెలుపు మంచి జనుల విధము
వంకలేని యలుగు వడిగ ప్రాణము దీయు ॥వి॥

## 204

చెడ్డరూపు జూచి చెడ్డవాడనరాదు
వాని పనులు తెలుపు వాని గుణము
వీణ పలుకు పాట వీనుల విందౌను ॥వి॥

## 205

చెడుగువానిచేత చేయించుకొని పనుల్
చెలిమి మిక్కుటముగ చేయరాదు
తమలపాకులందు తగు సున్నమేయమా? ॥వి॥

## 206

ఉత్తము దగు జనున కుపకారమును జేయ
ఫలము గలుగు వాని చెలిమి వలన
గడ్డిమేసి యావు ఘనమైన పాలిచ్చు ॥వి॥

207

చెడు జనునకు మేలు చేయరాదెన్నడు
కీడు గలుగు వాని కూడుకొన్న
పాములు విషమిచ్చు పాలకు బదులుగా ॥వి॥

208

పిండి కొద్ది రొట్టె పిల్లి కెలుక సాక్షి
పానకమున పడిన పాడు పుడక
ఆంధ్రదేశ వాసు లనుకొను సామెతల్ ॥వి॥

20‑

పెదిమ దాటి నంత పెన్న దాటును గదా
కోటి విద్య లన్ని కూటి కొరకె
ఆంధ్రదేశ వాసు లనుకొను సామెతల్ ॥వి॥

210

పూవు పుట్టి నంత పొలుపుగా వికసించు
పొందు లాభ మయిన పోదు నష్టి
ఆంధ్రదేశ వాసు లనుకొను సామెతల్ ॥వి॥

211

అతి రహస్య మనగ నది బట్టబయలయ్యె
అదిలోనె యంచపాదనంగ
ఆంధ్రదేశ వాసు లనుకొను సామెతల్ ॥వి॥

212

అన్న మందు చొరవ అక్షరమ్మున లేదు
గెలువు మింట పిదప గెలువు రచ్చ
ఆంధ్రదేశ వాసు లనుకొను సామెతల్ ॥వి॥

## 213

ఇంటి పొంగ దొరుక డీలనకైనను
ఎద్దు పుండు కాకి కేమి ముద్దు
ఆంధ్రదేశ వాసు లనుకొను సామెతల్ ॥వి॥

## 214

ఆలు లేదు మరియు చూలు లేదు కొడుకు
సోమలింగ మనగ చోద్య మగును
ఆంధ్రదేశ వాసు లనుకొను సామెతల్ ॥వి॥

## 215

ఇంట తినును మరియు నింటి వాసాలను
లెక్కపెట్టు గుణము లేనివాడు
ఆంధ్రదేశ వాసు లనుకొను సామెతల్ ॥వి॥

## 216

ఇంటిపేరు పునుగు ఇంట గబ్బిలముల
కంపు కాకిపిల్ల కాకి కింపు
ఆంధ్రదేశ వాసు లనుకొను సామెతల్ ॥వి॥

## 217

ఉడుత కుడుత శక్తి ఊపిరుంటే ఉప్పు
అమ్మి బ్రతుకవచ్చు నవని యందు
తెనుగువారి నోట తీయని సామెతల్ ॥వి॥

## 218

ఉట్టి కెక్కలేక నెట్టుల స్వర్గాని
కెక్కగలరు జనులు నిక్కముగను
తెలుగువారి నోట తీయని సామెతల్ ॥వి॥

219

ఏకపలుంచ బుట్ట లేమైన చిమగునా
కొఅవి తోడ తలను గోకినట్లు
తెలుగువారు పలుకు తీయని సామెతల్ ॥వి॥

220

కత్తి కేమి యెరుక కంద కుండు దురద
అప్పుచేసి తినెడి పప్పుకూడు
తెలుగుతల్లి నోట నొలికెడి ముత్యాలు ॥వి॥

221

తాడిదన్నువాని తలదన్నువాడుంటు
ముండ కాదు కాదు ముత్తయిదువ
తెల్గు దేశ మందు వెల్గెడి సామెతల్ ॥వి॥

222

శివుని యాజ్ఞలేక చీమైన కుట్టదు
అరచునట్టి కుక్క కరవలేదు
ఆంధ్ర దేశ మందు వినుకొను సామెతల్ ॥వి॥

223

ఆడబోవ తీర్థ మది యెదురైనట్లు
మోయువారి కెరుక మోతబరువు
తెలుగు చిలుక పలుకు తీయని సామెతల్ ॥వి॥

224

క్షేత్ర మెరిగి విత్తు పాత్ర మెరిగి పెట్టు
ఇంటికన్న గుడియె యింపుగుండు
తేటతేనె తెనుగు తీయని సామెతల్ ॥వి॥

225

ఏడ్పులోన నేడ్పు ఎడమచేతిని చూపు
భక్తిలేని పూజ పత్రి చేటు
తెలుగు చిలుక పలుకు తీయని సామెతల్ ॥వి॥

226

ఊత కన్న మించి లోతెక్కడను లేదు
మెరిసెడి వదియంత మేల్మిగాదు
తెలుగుతల్లి నోట వెలిగెడి సామెతల్ ॥వి॥

227

నవ్వు నవ్వినంత నాల్గందముల చేటు
నిండుకుండ తొనకకుండు నెపుడు
ఆంధ్రభాషలోని యందాల సామెతల్ ॥వి॥

228

గంతకు తగు బొంత గొంతెమ్మ కోరికల్
తగిలినట్టిచోట తగులు దెబ్బ
తెలుగు బాస దగులు తీయని సామెతల్ ॥వి॥

229

తనను మాలినట్టి ధర్మమ్ము గల్గునా
మొదలు చెడ్డ బేర మరచిచూడ
తెలుగు నోట దొరకు విలువైన సామెతల్ ॥వి॥

230

భక్తి చెప్పుమీద చిత్తము శివుమీద
పిట్టమీద వేయు పెద్ద యలుగు
తెలుగు వీర లేయు తీరైన సామెతల్ ॥వి॥

231

వినిన భారతమును వినవలె విందుగా
తినిన మినపగారె తినవలెనని
ఆంధ్ర జనత పంచు ఆమెతల్ సామెతల్

232

పాలలోల వెన్న పాలలోన పెరుగు
పాలలోన జున్ను లీల నుండి
నట్లు నిఖిల జగమునందు నీవుంటివి

233

తన ముఖమును తాను గనలేడు మానిసి
తాను తనదు వీపు గానలేడు
అయిన నీదు రూప మాత దెట్టుల గనున్

234

దీపకాంతి నాల్గు దెసల చూచిన యట్లు
నీదు చూపులెల్ల నిల్పి యఖిల
లోకమంతయు నవలోకన సేతువు

235

పేదవాని కీవు పెన్నిధు లిత్తువు
ఉన్నవారి నిధులు సున్నజేసి
నీదు లీల లివ్వి నిఖిల జగమ్ములో

236

కలము బట్టి కవులు కులమును తొలిగింప
మతము లన్ని మహిని మంటగలియు
వర్గ మెరుగనట్టి స్వర్గమ్ము నెలకొనున్

237

పిట్ట గింజలేరి పొట్ట పోసికొనును
చెట్టుకొమ్మ పైన చేరి బ్రదుకు
నాడు పోయ నీవె నీరు పోయుట నీవె ॥వి॥

238

వెండి నత్తు పసిడి పిలుపలు నీవయ్య
రాగి కంచు లోహ రాశి నీవు
పంచలోహములను పంచాణమున దీర్చు ॥వి॥

239

ముక్కున ధరియించు ముక్కెర పేసర
మెడన మిలమిలమని మెరయు తాళి
తెలుగు పడుచు మేన వెలుగు సొమ్ములు నీదు
విలువ తెలుపనయ్య విశ్వకర్మ

240

చెవుల వెలుగుచుండు చెవుపైన కమ్మలు
అంగుళముల గ్రాలు ఉంగరాలు
తెలుగు పడుచు మేన వెలుగు సొమ్ములు నీదు ॥వి॥

241

పాపిట వడుమ మను పాపిట బొట్టును
నాగరమ్ము మరియు గిగరమ్ము
తెలుగు పడుచు మేన వెలుగు సొమ్ములు నీదు ॥వి॥

242

గాజా లడ్డిగలను జాజుల హారమ్ము
మామిడి చిగురాకు మాలికలును
తెలుగు పడుచు మేన వెలుగు సొమ్ములు నీదు ॥వి॥

## 243

కంఠహార ముకర కంకణమ్మును నాను
నడుముపైన గట్టునట్టి నూలు
తెలుగు పడుచు మేన వెలుగు సొమ్ములు సీదు ॥వి॥

## 244

గాడిద యని ఖలుని యాడుచుందురుగాని
ఖరము బ్రతుకుచుండు కష్టపడుచు
అద్ది బరువుమోయు నతని కన్నను మేలు
విశ్వ ధర్మ మర్మ విశ్వకర్మ!

## 245

బర్రె పాలు తాగ బ్రతుకు మానవులెల్ల
ఏవగింత్రు దాని నెందుకయ్య
తల్లి తనకు గేదె తప్పు దూషింపగా ॥వి॥

## 246

బర్రె బర్రె యనుచు పలు దూషణలు పల్కి
బర్రె పాలు పెరుగు జుర్రుకొంద్రు
బర్రె యనుచు దిట్ట వైరితనముగదా ॥వి॥

## 247

దున్న దున్న యనుచు తన్నుచుందురుగాని
తన్నువానికన్న దున్న మేలు
దున్న మడుల దున్ను నెన్న మిన్నయె గదా ॥వి॥

## 248

మొద్దువాని గాంచి యెద్దని దూషింత్రు
మొద్దువానికన్న ఎద్దు మేలు
హలము మోసి దున్ను పొలమును బలముతో ॥వి॥

249

దాని పేడ మూడ దాని ఎముక తోలు
మొత్త మవయవాలు విత్త మిచ్చు
బతికిన మడిసినను పశువిచ్చు సంపదల్ ॥వి॥

250

పశువు గడ్డి తినుచు పాలిచ్చుచుండును
పాలు తాగు మనిషి పాపి యగును
పాడు మనిషి కంటె పశువులు మేలౌను ॥వి॥

251

ఆవు మేయుచుండు నౌషధీ లతలెల్ల
మెండుగాను కొండ కొండలందు
ఆవుపాల నందు రందుకే మందంచు ॥వి॥

252

గుడిని పట్టి నతడు గుడిని గట్టి నతడు
తోడుదొంగ లట్లు దోచుచుంద్రు
భక్తి పేర వారు భుక్తి సంపాదింత్రు ॥వి॥

253

కుతిక వరకు తాగి కుల మెక్కువనుగాని
మాంస మందు రుచిని మరిగి మరిగి
మదిని గట్టుకొంద్రు మాన్యులీ మహిలోన ॥వి॥

254

గుడులలోన గొట్టి కొబ్బరికాయలన్
ఒక్క ముక్క గూడ నొరుల కీక
మెక్కు భక్తవరుల మొక్కు లీడేరునా? ॥వి॥

255

పొలతుల పయిబడును పూజారి కన్నులు
చిన్న భక్తవరుల కన్ను లంతె
దేవళమున నివ్వి దేవులాటలు గదా ॥వి॥

256

నగలమీద భక్తి నారీమణుల కెల్ల
నగదు మీద భక్తి మగల కెల్ల
అలయమ్ము నందు నందుకే మ్రొక్కటల్ ॥వి॥

257

అడువారి జూచి యావురావురు మంచు
సగము కన్ను మూసి సగము దెరచి
గుంపులోన కలిసి గోవింద యందురు ॥వి॥

258

విలువబొట్టు బెట్టు నిష్టగాడైనను
అడ్డబొట్టు దాల్చు నయ్య యైన
అందరు నడుగునది యచ్చటికే గదా ॥వి॥

259

తమిళభాష యనుచు తగవు లాడుటదేల
రోష మేల హిందిభాష యెడల
భాష యేదియైన భావ మొక్కటి గదా ॥వి॥

260

కులము కుల మటంచు కలకల మదియేల
ఎక్కు తక్కు వనెడి లెక్కలేల?
ఎక్కు తక్కువెల్ల చిక్కదా కాటిలో ॥వి॥

261

అద్దె కొంప లోక మాలోకనము సేయ
పద్దు పొమ్మనగనె వదలవలయు
దానికోప మింత తగవులాట లవేల ॥వి॥

262

నేల దున్న నరక నీవె చేయవలయు
కాడిమాను చేయువాడవీవు
గింజ లిల్లు సేర గిత్తల వాహనం
విశ్వమెల్ల నీది విశ్వకర్మ!

263

సిగ్గు దాచుకొనెడి చీరలు నేయంగ
మగ్గ మనెడిదాని మలచినావు
ఇండ్లకుండు తలుపు లిండ్లిండ్ల తాళాలు
విశ్వమెల్ల నీది విశ్వకర్మ!

264

వంట చేసికొనగ నింటిలో పాత్రలు
రోలు గుంటె లోట రోకలియును
నీదు చేయి తగుల కేదియు లేదయ్య
విశ్వధర్మ మర్మ విశ్వకర్మ!

265

వేంకటేశు తలను వెలుగు కిరీటమ్ము
కనకదుర్గ చేతి కంకణాలు
నీదు చేయి తగుల కేదియు లేదయ్య ॥వి॥

266

చెప్పుగుట్టువాని చేతిలోపలి నారె
మంగలి కరమందు మనెడి కత్తి
నీవు చేయనట్టి దేవస్తువును లేదు ॥వి॥

267

వేరగాని చేతి పెట్టెయు త్రాసును
తూకమేసికొనెడి తూకములును
నీవు చేయకుండ నే వస్తువును లేదు ॥వి॥

268

కూలివాడు రాళ్ల కొట్టెడి సుత్తెయు
కోత కుపకరించు కొడవలను
నీదు చేయి తగుల కేవస్తువును లేదు ॥వి॥

269

తోలు మూసి కొట్ట రోష్మని పల్కెడి
డోలు తబల రాపదోలు డప్పు
నీదు చేయి తగుల కేవస్తువును లేదు ॥వి॥

270

వెదురుగడను కాల్చి వేణువు సృజియించి
వీణ జేసినావు విందు గొల్ప
నీదు చేయి తగుల కేవస్తువును లేదు ॥వి॥

271

కమ్మరి కొలిమియును కుమ్మరి సారెయున్
కంచరి పనిముట్లు మంచములును ॥నీదు॥ ॥వి॥

272

ఇంటి యింటి యందు ఇల్లాలి మెడలోని
తాళిబొట్టు చేయు దైవ శిల్పి ॥నీదు॥ ॥వి॥

273

పుట్టలోని ఫణికి పూజలు సేతురు
పాలుబోసి పూలు రాలజేసి
బయట గానుపింప భంగపరచు టేల ॥వి॥

274

ఉప్పు గుంతలోన ఉద్భవించిన జన్మ
బురద గుంతలోన పుట్టు జన్మ
అట్టి జన్మ దీని కార్భాట మేలయా ॥వి॥

275

కొండ కోనలోన పండిన పండ్లను
తినుచునుంద్రు పుట్టతేనె కలిపి
చెంచువారి తిండి మంచి బలమొసంగు ॥వి॥

276

గడ్డి గింజ లిచ్చి కాపాడు ప్రాణాల
పశువు తినగ గడ్డి పనికివచ్చు
పెద్దమనిషికన్న గడ్డి మేలే గదా ॥వి॥

277

ఆవును భుజియింప నారోగ్యమును నొక్క-
డావు నమ్మవంటి దను నొకండు
ఏది సత్య మందు ఏ దసత్యమ్మయా ॥వి॥

278

మాంస భక్షణమ్ము మాకు గాదని పల్కి-
వెన్న జున్ను పెరుగు తిన్న నద్ది
పశువు నెత్తు పిండి భక్షించుటే గదా ॥వి॥

279

మాల నేయు మడత మాదిగ కుట్టెడి
చెప్పు తొడుగవచ్చు చెన్నుమీర
వారి నంటరానివారన నేలయా ॥వి॥

280

ముట్టు మురికిగుడ్డ పట్టి ఉతికినవాడు
క్షౌర కర్మ జేయ గలుగువాడు
లోకనమ్ము సేయ లోక బాంధవులయా ॥వి॥

281

రోయకనె మురికిని రోజు నూడ్చెడివాడు
పాకి పనులు జేయు పావనుండు
లోకనమ్ము సేయ లోకబాంధవులయా ॥వి॥

282

ఆశ్వయుజము మరియు కార్తీక మాసాల
శారదాగమమ్ము వార కగును
వర్ష ఋతువు వెంట వచ్చెడి ఋతువిద్ది ॥వి॥

283

అన్ని దెసల నుండి యరుదెంచు వాయువు
కన్నె లేళ్ళ కిపుడు కలుగు మదము
శారదమ్ము హర్ష నీరదమ్మే గదా ॥వి॥

284

లావు గలుగుచుండు లకుముకులంచలకు
కొక్కెర పులుగులకు నెక్కు మదము
శారదమ్ము హర్ష నీరదమ్మే గదా ॥వి॥

285

చక్రవాకములకు చంచరీకాలకు
కాయిక పులుగులకు కలుగు మదము ॥శా॥ ॥వి॥

286

బెగ్గురు పులుగులకు బేడసచేపకు
కొంగకు మరి కరికి కొవ్వు గలుగు ॥శా॥ ॥వి॥

287

పంకజాలు విరియు మంకెనల్ వికసించు
తెల్ల నల్ల కలువ లెల్లపూయు ॥శా॥ ॥వి॥

288

ఎదిగి పూయుచుండు నేడాకులరటులు
కుంకుమ తరువిప్పుడు కురియు పూల ॥శా॥ ॥వి॥

289

ఎఱ్ఱ కలువ విచ్చు ఎద్దుకు మదమెక్కు
విరియు వావిలియును విరియు రెల్లు ॥శా॥ ॥వి॥

290

మాలతి లతికలు మామిళ్ల పెనవేయు
నిప్పుడు క్రొవ్వకుండు నెమిలి పిండు ॥శా॥ ॥వి॥

291

జలము కలకదేరి జల జల పారును
హంస లెగిరివచ్చి యందు దిరుగు ॥శా॥ ॥వి॥

292

ముత్యములను గనును ముత్యపు చిప్పలు
నీలి నింగి యందు నిలుచు మబ్బు ॥శా॥ ॥వి॥

293

హయములకు కరులకు హారతు లిత్తురు
పంక మెండియుండు బాటలందు ॥శా॥ ॥వి॥

294

చయ్యన సలుపుదురు శస్త్రాస్త్ర పూజలు
భానుతేజ మిపుడు పరిఢవిల్లు ॥శా॥ ॥వి॥

295

మేలుకొనుచు విష్ణు వేలుకొను నిప్పుడు
పొలము నందు వరికి పొట్ట బట్టు ॥శా॥ ॥వి॥

296

గోపకాంత లిపుడు కూడిపాడుచు నుంద్రు
గాలి యన్నిదెసలు తోలుచుండు ॥శా॥ ॥వి॥

297

చంద్ర దర్శనమగు శారద రాత్రులన్
శారదాంబ పూజ జరుగు చుండు ॥శా॥ ॥వి॥

298

విజయదశమి వచ్చి విజయ మిచ్చుచునుండు
జమ్మిచెట్టు కిపుడు జరుగు పూజ ॥శా॥ ॥వి॥

299

ఆడుకొంద్రు పిల్లలట్లతద్దియ నాడు
భోగినాడు చెట్లు నూగుచుంద్రు ॥శా॥ ॥వి॥

300

జరుగు కాళికి బలి శారదాగమమున
ఫలముల గొని చేవి ఫలము లిచ్చు ॥శా॥ ॥వి॥

301

అమ్మవారి పసిడి బొమ్మ నూరేగింప
అర్ధరాత్రిపూట నరుగుదెంత్రు
ముందు త్రాగుబోతు చిందువేయుచునుండు
విన్నవింతునయ్య విశ్వకర్మ:

302

డాన్సుపిల్ల లెగిరి డాన్సు చేయుచు నుండ్రు
సెక్సుపాట మైకుసెట్టు పాడు
పొగు గుంపు వెంట సారాయి కంపుతో ॥వి॥

303

అమ్మవారి బొమ్మ వసలు చూడరుగాని
ఆడువారిపైన పాడుచూపు
ఆట పిల్లపైన అందరి చూపులు ॥వి॥

304

అగరు వత్తి పొగల వసలు మూర్కొనకుండ
పీకె కాల్చి పొగను పీల్చువాడు
ఆకు నమలి పిప్పి నంతట నూతురు ॥వి॥

305

ముందు సినిమ బండి ముందు సోడా బండి
సందు జూచి దొంగ సాగుచుండు
భక్తిగాదు జనుల రక్తి కోసమెగాని ॥వి॥

306

దేవతలను పేర విట్టి వ్యయము చేయు
కన్నదానమీయ మిన్నగాదె
పేదకడుపు నిండ పెద్ద పండువు గదా ॥వి॥

307

దీపరాజి వెలుగ దివ్వెల పండుగ
తిమిర పుంజమనెడి తెరలు దొలగు
అందు కొరకె జనులు మందులు గాల్తురు ॥వి॥

308

కాకర పువు వత్తు కాల్చిన పువ్వులు
అగ్గిపుల్ల గీయ నల్లె పూలు
మెరుపు తీగ కాల్చ మిల మిల పువ్వులు

309

ఒక్కయింట మూల్గు ఒకయింటిలో వెల్గు
పండగొక్క యింట నెండ గొకట
ఆకలియను చిచ్చు కాకరపువ్వులు

310

పొయ్యిరాజ గొకట పూలురేగు నొకట
చీకటొక్క యింట చిందులొకట
కనుల వత్తి తోడ కన్నీళ్ల దీపాలు ॥వి॥

311

ఒక్క యింట నొవ్వ ఒక యింటిలో నవ్వు
పాయస మొక యింట పస్తులొకట
గుండెమంట లగును మండెడి బాంబులు ॥వి॥

312

ఇద్ది కాదు వెలుగు ఇదికాదు సంబర
మిద్దికాదు పండు గిద్దియోగు
కడుపు మంటనార్ప గలుగుటే వెలుగౌను ॥వి॥

313

ఇంత మందు గాల్చి యింత ద్రవ్య మిటుల
కాల్చినంత ఫలము కలుగ బోదు
కడుపుమంట నార్ప గలుగుటే ఫలితమ్ము ॥వి॥

314

కనపడునవి యెల్ల కాంతులు గావయా
గడ్డివామి మంట కాదు వెలుగు
పశుల నోంఃగొట్టు పాడు చీకటి గదా ॥వి॥

315

మంచి భావ మొకటి మనిషికుండిన చాలు
ఆత్మలోని ధ్వాంత మంత మొందు
కొండకు వెలుగిచ్చు గోరంత దీపమ్ము ॥వి॥

316

సామ్యవాద మనెడి చల్లని వెన్నెల
కాయునట్టి ఋతువు కలుగ గలదు
అపుడె పేదనేల కగును శ్రీమంతమ్ము

317

ఇపుడు వచ్చు నొక్క ఇస్లాము పండుగ
పెద్దవారి పండు విద్దియందు
ముసలి మానులంత ముదమొందు చుందురు ॥వి॥

318

మాట వేరుగాని మనుగడ ఒక్కటే
వేష మొక్క యింత వేరుగాని
పండుగేది యైన పండి భుజించుచే ॥వి॥

319

గడ్డమొకడు పెంచి దొడ్డవాడ ననును
పిలక పెంచి యొకడు పెద్ద నను
ఎన్ని పెంచనేమి నున్నయా చివరకు ॥వి॥

320

ఎవడు తురక హిందు వెవ్వడు బౌద్ధుడు
ఎవడు క్రైస్తవుండు ఎవడు శిక్కు
ఒక్క పాటలోని చక్కనౌ చరణాలు ॥వి॥

321

మార్గశీర్ష పౌష్య మాసాలు హేమంత
కాంతి ఎచ్చు కరము సంతసముగ
కాంతిమంతము గద వింత హేమంతమ్ము ॥వి॥

322

పూయు మల్లెపూలు ముచుకుందములు పూయు
మంగ క్రొవ్వడంగు పాప తతికి
కాంతిమంతము గద వింత హేమంతమ్ము ॥వి॥

323

నెమ్మి క్రొవ్వ దంగి నిమ్మళముగ నుండు
అణగి యుండు క్రొవ్వ అళులకిపుడు ॥శా॥ ॥వి॥

324

సోయగము లొలికెడి సురపొన్న వికసించు
లలిత లలితమైన లవలిపూయు ॥కాం॥ ॥వి॥

325

గంధతైలములను కామినీ మణులెల్ల
సేవనమ్ము తోటి సేసికొంద్రు ॥కాం॥ ॥వి॥

326

కలికి రొమ్ములిపుడు నులివెచ్చగా నుండు
ఇంతులు బిగికౌగిలింత నుంద్రు ॥కాం॥ ॥వి

327

జనులు గోరువెచ్చ జలకము లాడేరు
పెరుగు చుండు నిపుడు పెరుగు రుచులు ॥కాం॥ ॥వి॥

328

కూపమందు జలము గోర్వెచ్చగా నుండు
ఇపుడు వ్యాఘ్రకాంత లీనుచుండు ॥కాం॥ ॥వి॥

329

రేగుచెట్లు గంగరేగుచెట్లిప్పుడు
కమ్మని ఫలములను కుమ్మరించు ॥కాం॥ ॥వి॥

330

చెరుకు లందు రసము చిప్పిలుచుండును
పడమటి పవనాలు పరుగులెట్టు ॥కాం॥ ॥వి॥

331

ఉత్తరానిలముల మొత్తము అలరారు
మందిరమ్ము నందు మంచినిదుర ॥కాం॥ ॥వి॥

332

గబ్బి గుబ్బలున్న కామినీ తతి భుజ
పంజరముల పతులు పవ్వళింత్రు ॥కాం॥ ॥వి॥

333

క్రీస్తు జన్మతిథిని క్రిస్మసు పండుగ
జరుపుకొందు క్రీస్తు జనులు గూడి
మంచి ముత్తియములె మంచిచ్చు నుడుగరల్ ॥వి॥

334

మతము వేఱుగాని మనుగడ ఒక్కటే
గతులు వేఱుగాని గమ్య మొకటి
ఎన్ని మతములున్న అన్ని యచ్చోటికే ॥వి॥

335

పండుగేదియైన వండి భుజించుటే
తిండిలేని నాడు పండుగేది
ఊర భక్తులుండి యూరకుందు రటయ్య ॥వి॥

336

క్రీస్తు భక్తుడైన కృష్ణ భక్తుండైన
ఆస్తులున్ననాడు జనవరొకటి
ఆస్తిలేనివారి అన్వయ మొక్కటే ॥వి॥

337

భక్తి గలుగ జాలు వ్యక్తి భక్తుడగును
భుక్తి లేనినాడు భక్తి లేదు
భక్త జనుల భజన పరమార్థ మిదిగదా
విశ్వ ధర్మ మర్మ విశ్వకర్మ:

338

ఇంగిలీషువార లిటనుండి పోయినన్
జనవ రొకటినాడు జరుగువేడ్క
పాలన పడిపోయె పండుగ పోలేదు ॥వి॥

339

మోదమీయ గలుగు ముక్కోటి పండుగల్
అన్ని మతములందు నున్నవయ్య
మోద మీయగలరు ముక్కోటి దేవతల్ ॥వి॥

340

భోగినాడు చలికి భోగిమంటలు వేసి
చుట్టుచేరి కూరుచుంద్రు జనులు
మంట వీడిరాగ వెంటనే చలివచ్చు ॥వి॥

341

ఉన్నవారి కడుపు లుండు చల్లగ కన్న
అట్టివారి కగ్గి యవసరమ్ము
పేదకు కలవయ్య పెద్ద యాకలి మంట ॥వి॥

342

కొంకులు తెగ గొట్టు సంకురేతిరి వచ్చు
పెద్దపండుగనుచు పిలుచుచుంద్రు
మకరసంక్రమణమ్ము మరియొక నామమ్ము ॥వి॥

343

రంగు రంగుల బలు రంగవల్లులు దీర్చి
రమణులుందు రిపుడు సుమము అట్లు
ఉన్నవారి కుండు నెన్నియో వేడుకల్ ॥వి॥

344

మగువలు పరిచెదరు ముత్యాల ముగ్గులు
ముంగిటి పడసిరులు ముద్దులొలక
పెన్నిధిగల యింట పేరంటముల పంట ॥వి॥

345

భాగ్యశాలురైన పడతుల యిండ్లకు
పేద యాడువారి బిలువ వచ్చి
పట్టుచీరె నగలు పడి పడి చూతురు ॥వి॥

346

ఇద్దిగాదు పండు విడిగాదు సంబర
మిద్ది పీడకరం బిద్ది దొసగు
కలిమిలేమి మధ్య కలుగు వైరమెగదా

347

కలిమిలేమి భేదములు లేని కమ్మని
కాల మెప్పుడు వచ్చు కలుగునప్పుడె
మకరిసం ణము మా దేశమందునన్

348

కనుమనాడు నెపటి కరుగ రాదందురు
కాలచక్ర వేగ మేల నిలచు
రథము లూరకొనక రైళ్లూరకుండు?

349

భరత వర్షమునకు తిరముగ సంపూర్ణ
మైన స్వేచ్ఛ కలిగినట్టి దినము
జనవరిరువదారు జరుగును పండుగ ॥వి॥

350

పరుల పాలనమ్ము పడిపోయి దేశము
పాలనమ్ము వచ్చె ఫలిత మెపుడు
ఆర్థికమగు స్వేచ్ఛ నందికొన్నప్పుడే ॥వి॥

351

స్వంతయాస్తి హక్కు లంతమై పోవలె
కులము మతము మంటగలువవలయు
అంతవరకు దేశమంధకారముగదా ॥వి॥

## 352

మంచిమనసు గలుగు మా గాంధితాతయ్య
నరక మందు పుట్టినాడు కాని
పుణ్యభారతమున పుట్టినా డందుచు. ॥వి॥

## 353

అతడు చెప్పినట్టి యార్థికసిద్ధాంత
మసలు నచ్చనట్టి అయ్యలంత
అతని చావుగోరి రానాడు దుర్మతుల్ ॥వి॥

## 354

మతము గతము వద్దు మనకవి పలికిన
మాట నచ్చనట్టి మాన్యుడొకడు
గాంధితాత చావు కళ్ల జూచెనుగదా ॥వి॥

## 355

గాంధిబాట మరచి గాంధేయులనువారు
ముళ్లబాట మీద మోజుపడిరి
గాంధివచ్చినాడు గనుక బ్రతికినాడు ॥వి॥

## 356

వేడ్క వద్దు కలిమివెన్నెల గలదంచు
కలిమి వెంట లేమి క్రమ్ముచుండు
కాళరాత్రివోలె కలుగు లేనితనమ్ము ॥వి॥

## 357

పెన్నిధిగల పెద్ద పెద్ద చెట్లన్నిటి
ఆకురాల్చ శిశిర మవతరించు
విధము క్రొత్తదైన పథమునుదెంచును ॥వి॥

358

మాఘ పాల్గునమను మాసమ్ములందున
తెచ్చు శిశిర ఋతువు హెచ్చుచలిని
శశిరఋతువు నందు శైత్యమే ముందును ॥వి॥

359

పండి దున్నలకును పట్టును గొప్పది
కరికి వేడి కిప్డు కలుగు గొప్ప ॥శ॥ ॥వి॥

360

సురత యోగ్యులగుచు సుందరు లందురు
చందనమ్ములు మనకెందు కంద్రు ॥శ॥ ॥వి॥

361

కూరుచుండు రిపుడు కుంపట్ల ప్రక్కనే
జలములెల్ల కరము చల్లబడును ॥శ॥ ॥వి॥

362

మరువక వికసించు మరువక కుసుమాలు
కుందము వికసించు నందముగను ॥శ॥ ॥వి॥

363

చండమారుతములు చలి గలిగించును
జల్లుమనుచు నాకు ఝల్లుచుండు ॥శ॥ ॥వి॥

364

శిశిరఋతువు నందు శివరాత్రి వచ్చును
పరమశివుని గొలుచు పండుగిద్ది
పెరుగు చూతఫలము చెరలింగకాయంత ॥శ॥ ॥వి॥

365

ఆరగింత్రు పళ్ల హరహరాయని పల్కి
ఉప్పుపిండి మెక్కి ఉపవసించి
తిండి దండిగాను తిను టుపవాసమా ॥వి॥

366

శివుని పేరుజెప్పి సినిమాను గని వచ్చి
నిదుర మానినంత నేమి ఫలమొ ?
జాతర యగుగాని జాగార మెట్లయా? ॥వి॥

367

దేవుని గనుగొనగ దేనికి టిక్కట్లు
ఉన్నవారు దప్ప కొనుట దెవరు
కొననివారు శివుని గనలేనివారలా ॥వి॥

368

పేదవాని బ్రతుకె పెద్ద పండుగ గదా
తిండులేక పస్తు లుండు నతడు
ఇంతన్న నుపవసించు టెక్కడ నుండు ॥వి॥

369

ఎప్పుడు శివరాత్రి యేమిటి శివరాత్రి
బిచ్చగాండ్లు మరియు బీదవారు
లేనినాడు లేమి లేనిదే శివరాత్రి ॥వి॥

370

ఎప్పుడు శివరాత్రి యేమిటి శివరాత్రి
కలిమి లేమి తేడ కలుగనట్టి
రాత్రి మాత్రమే శివరాత్రి యౌను నిజము

371

ఏమి శివుడు గోరు నెద్దేశునకు మేలు
కోరు సర్వజనుల కార్తిఫలము
జగములు సుఖియింప జంగమయ్యకు మేలు ॥వి॥

372

అల విభూతి యనగ వెలియాడిపని గాదు
సర్వజనులు పొందు సౌఖ్యమగును
అట్టిదగు విభూతి నభవువాలించును ॥వి॥

373

అకురాల్చు శిశిర దనుమెంచు విధమున
సామ్యవాద రధము సాగివచ్చి
ధనిక వృక్షములను దండించినలయును ॥వి॥

374

శిశిర వాతమునకు శిశువు చచ్చినయట్లు
సామ్యవాద ఝంజ సాగిరాగ
స్వామ్యవాద పశువు చావమేలాగదా ॥వి॥

375

అపుడు వెంటవచ్చు ఆమని విధముగా
సామ్యవాద ఋతువు సామ్యమొసగ
అంత పేద తరువులన్నియు చిగురించు ॥వి॥

376

చయ్యన చనుదెంచు చైత్ర వైశాఖమా
సముల యందు నవ వసంత ఋతువు
ఆమని గనినంత అవనికి పులకింత ॥వి॥

377

గోరువంక చిలక కోయిల తుమ్మెద
కూయు చుండునిపుడు క్రొవ్వుబట్టి
ఆమని గనినంత అవనికి పులకింత ॥వి॥

378

చెట్టులన్ని బాగా చిగురించు చుండును
పూలనేరు చుండు పొలతి పిండు ॥అ॥ ॥వి॥

379

ఉపవనములలోను నూగెదరుయ్యాల
పికముల రవము బహు పిక్కటిల్లు ॥అ॥ ॥వి॥

380

ఎచ్చట గనుగొనిన పిచ్చి చెట్ల నుబోలు
పూరిగుడిశ లున్న పుణ్యభూమి
ఎక్కడో గన నొక చక్కని పువుమేడ ॥వి॥

381

చిరుగుపాత దొడిగి చిక్కిన మేనితో
నుండు పేదవారె ఎండుచెట్లు
వారి బ్రతుకులందు వాసంత మెపుడయా ॥వి॥

382

కర్షి కారములను వర్ణించెదరుగాని
కలిమిగలుగు వారు కనులువిప్ప
కష్టలు చెప్ప కవుల కవిత వసంతమా ॥వి॥

383

కలిమిలేమి తేడ కలుగని కాలమ్ము
కొత్తఋతువు వోలె కొలువుదీరు
ఋతువు మారినట్లు మతము మారవలయు ॥వి॥

384

వాడినట్టి పేదవల్లి చిగురులువేయు
అమని వడివడిగ నవతరించు
పల్లెలోని పేదచెల్లి సంతోషించు ॥వి॥

385

మల్లె మొల్ల వకుళ మరువక కుసుమాలు
బంతి సన్నజాజి మాలతులును
ఒక్క దండలోని కెక్కెడి చెపుమయా ॥వి॥

386

గడ్డిపూలు కూడ గణుతి కెక్కగవలెన్
తంగెడు విరులవెల తక్కువేమి ?
రంగు తక్క అంతరంగ మొక్కటిగదా ॥వి॥

387

తెల్గువత్సరాది వెల్గులు చెప్పును
వేపపూప్రసాద విధము గనగ
జీవితమున తీపి చేదు సామవిపించు ॥వి॥

388

యుగమనంగ రెండు పగలును చీకటి
యుగమనంగ రెండు నుత్తరాయ
ణమ్ము దక్షిణాయనమ్ము యోచింపగా ॥వి॥

389

అద్ది యిద్దియనెడి భేదమెంచక మధు
కరని కరము గ్రోలు కరము మధువు
అళి కులమ్ము పూల కులమెంచ చెప్పుడున్ ॥వి॥

390

తేటిగుంపు లొక్క పాట పాడుచు రేగి
పూల దొరల గొట్టి పొందు తేనె
అట్టి విధము మేము పట్టు సామ్యవసంబు ॥వి॥

391

కదలి పొంగుచుండు కలిమి కలిగెనంచు
సామ్యవాద గ్రీష్మసఖుడు వచ్చి
కడలిని కబళించి పుడమి కొసంగడా ॥వి॥

392

చేరు గ్రీష్మ ఋతువు జ్యేష్ఠమాస మునందు
శ్రావణమున తరలిపోవు మరల
గ్రీష్మ మఖిల జంతు భీష్మమై చనుదెంచు ॥వి॥

393

పూయు చంపకములు పూయు శిరీషమ్ము
పూయుగేదగులును పూయుమల్లె
పండు ఖర్జురములు పండును నేరేళ్లు ॥వి॥

394

గ్రీష్మ ఋతువు జూడ భీష్మమైననుగాని
పంచి పెట్టుచుండు పనస పండ్లు
మాట వేడిగాని మనసు మామిడిగదా ॥వి॥

395

ధనికులనెడి నదులు దర్పమ్ముతో నుండ
సామ్యవాద గ్రీష్మ సఖుడువచ్చి
నదుల నీళ్ళు పేదన భమున కిచ్చును ॥వి॥

396

చలువనీటి నొసగు చలిపందిరు లిపుడు
సామ్యవాద సంఘ సరణి దోచు
కులము లెంచకుండ జలముల పంచును ॥వి॥

397

చెట్లొసంగుచుండు చిక్కనౌ నీడలు
సామ్యవాద సంఘ సరణి దోచు
మతము నెంచకుండ మర్యాద చేయును ॥వి॥

398

ముళ్ళకంపపైన పూల పొదలపైన
వెలుగు గురియు వెండి వెన్నెలట్లు
వెలుగునట్టి శక్తి కలుగజేయము దేవ ॥వి॥

399

మంచిని తలపై వహించెద శశిపోలె
చెడ్డను గళమందు చేదువోలె
నిలుపు కొందునయ్య నిటలాక్ష రీతిగా ॥వి॥

400

పోకచెక్క సున్నమేకజాతివి గాదు
తమలపాకు కులము తలపవేరు
అన్నికలిసి బ్రతుకు ననురాగములు జిలుక ॥వి॥

401

అడవిలోన బుట్టు నాకుల కూరలు
కడలి యందు నుప్పుగల్లు బుట్టు
కుండలోన గలిసి యుండవా రుచు లీయ ॥వి॥

402

నాగలి కులమేది ? మాగిలి కులమేది ?
భూమిదున్ను నెడ్ల పుట్టువేది
అన్నికలిసి యుండి అన్నమిచ్చును గదా ॥వి॥

403

మల్లెపూల కులము తెల్లదైతే నేమి?
కులము నల్లదైన కురులకేమి?
రెండు గలసి తలల నుండవా జంటగా? ॥వి॥

404

కాకి కాకి కలసి కట్టుగా జీవించు
గొఱ్ఱె గొఱ్ఱె యొకటి గూడియుండు
మానసులకు పడదు మాయరోగ మదేమొ? ॥వి॥

405

కప్ప తాగి యుమియు చేపతాగి యుమియు
నూతిలోని ప్రాణులన్ని యుమియు
ఉదకమెల్ల చూడ నుచ్ఛిష్టమే గదా ॥వి॥

406

సుబ్బలక్ష్మి పాట సోయగమేమందు
ఆమె సాటి యెవ్వ రామె గాక
ఘంటసాల పాట ఘనమైన పాటరా ॥వి॥

407

అక్కినేని నటన అందమేమందును
అతని సాటి యెవ్వ డతడు గాక
నందమూరివారి యందమే యందము ॥వి॥

408

ఎల్లనటులె యందు బళ్ళారి రాఘవ
మేటి నటు డటంచు చాటగలను
అతని కతడె సాటి యన మేలు గాదొకో ॥వి॥

409

స్థానమగ్రమందు స్థానమువారికి
ఆడువేషమేయ నతని కతడె
సాటి యనుచు మాటి మాటికి పల్కెదన్ ॥వి॥

410

మాతృదేశమందు మాతృ భాషలయందు
మమత పెంచుకొనుట మంచి పరుల
దేశభాషలందు ద్వేషమ్మదేలనో ॥వి॥

411

నోట్లుపెట్టి కొందు రోట్లను నాయకుల్
సీట్లు గెలిచి సభల కోట్లుపొంద
ఓటువిలువ నెరుగ రోగులు మన ప్రజల్ ॥వి॥

412

స్వార్థబుద్ధిగాని సిద్ధాంతములు లేవు
విస్పన నుడివినది వేదమనగ
ఓటు కులము కిచ్చు ఓటమి పార్టీకి ॥వి॥

413

దొంగఓట్లు వేయు దొరలుందు రిలలోన
చచ్చినతని ఓటు వచ్చి నిలుచు
పంచిపెట్టుచుంద్రు పసిపిల్లలకు ఓట్లు ॥వి॥

414

ఓట్లు పడక ముందు కోట్లవాగ్దానాలు
ఓటు పడిన వెనుక మాట బందు
ఓట్లు గుంజువాడి పాట్లేమి చెప్పుదున్ ॥వి॥

415

చదువురాని మొద్దువెధవకు ఓటీయ
ఓటు విలువ కట్టి పాటుగలిగె
ఓట్లు పశుల కిచ్చు నుత్తమ రాజ్యమ్ము ॥వి॥

416

కులమున కొకపార్టి కులమున కొక జెండ
కులము కులము కొక్క గుడియు గలదు
కులము కులము వారి కొక్క కళాశాల ॥వి॥

417

పండితు డగుగాక భక్తుడగును గాక
కవిత లల్లగలుగు ఘనుడు గాక
డబ్బులేనివాడు డుబ్బుకు కొరగాడు ॥వి॥

418

పలుకుబడి గలిగిన పదవులు లభియించు
లేనివాని కిలను లేదు పదవి
ఉన్నవారి కెలమి నన్ని సుఖము లుండు ॥వి॥

419

విద్య యించుకంత విద్యార్థులకు రాదు
లేదు వినయ మసలె లేదు నీతి
గుణము దుర్గుణమ్ము గురు పీడనము గదా

420

మధువు గ్రోలుచుండు మత్తుగా పడియుండు
మాంస భక్షణమ్ము మరువకుండు
ఇకట్టి గుణములున్న ఇప్పటి విద్యార్థి ॥వి॥

421

పగటినిద్రబోవు పలుపోకడల జూచు
పరవనితల గాంచి పాడుచూపు
ఇట్టి సుగుణ వార్థి ఇప్పటి విద్యార్థి ॥వి॥

422

గురువు నెదుట కాళ్ళ గురిచూపి కూర్చొని
గోడకానుకొంద్రు గుంపు గూడి
ఇట్టి సుగుణ వార్థి ఇప్పటి విద్యార్థి ॥వి॥

423

నీటు వలువ గట్టి నిష్ఠీవనము వేసి
అవులించి తుమ్ము నధమ గుణుడు
ఇట్టి సుగుణవార్థి ఇప్పటి విద్యార్థి ॥వి॥

424

శిష్యు బెదవులందు సిగ రెట్టు తా బెట్టి
అగ్గిపుల్ల గీచి యంటజేయు
గురువుగారి నేటి ఫరువిట్టులున్నది ॥వి॥

425

పాఠశాలయందు పాఠాలు చెప్పడు
ఇంటిలోన చెప్పు నింతగొనును
గురువుగారి నేటి పరువిట్టులున్నది ॥వి॥

426

పాఠములను జెప్ప పాటగుచుండును
రాజకీయమందు రక్తి గనును
గురువుగారి నేటి పరువిట్టులున్నది ॥వి॥

427

సగ మితర విషయము సగము పాఠ్యాంశమ్ము
తరగతందు జెప్ప మరగినాడు
గురువుగారి నేటి పరువిట్టులున్నది. ॥వి॥

428

గురువు చేయిబట్టి యరుగును సినిమాకు
కల్లు ద్రాగి తినుచు కలిసి యుండు
ఇట్టి సుగుణ వార్ధి ఇప్పట్టి విద్యార్థి ॥వి॥

429

కత్తి చేత బట్టి కాలేజి విద్యార్థి
రూక్షణ మగునట్టి వీక్షణమున
హేయమైన రీతి వ్రాయు పరీక్షలన్ ॥వి॥

430

ఈల వేయుచుండు గోలచేయుచు నుండు
కునికిపాట్లుబడుచు కూరుచుండు
ఇట్టి సుగుణ వార్ధి ఇప్పటి విద్యార్థి ॥వి॥

431

చూచి చదువ లేడు చూచి వ్రాయలేడు
బదులు చెప్పలేడు ప్రశ్న వేయ
ఇట్టి సుగుణ వార్ధి ఇప్పటి విద్యార్థి ॥వి॥

432

చెడ్డ విషయమన్న చెవిగోసికొనుగదా
బడికి వెళ్ళ మనిన బడలికగును
ఇట్టి సుగుణ వార్థి ఇప్పటి విద్యార్థి ॥వి॥

433

సమ్మెలన్న తనదు సొమ్మనుకొనుచుండు
రువ్వుమనిన రాళ్లు రువ్వగలడు
ఇట్టి సుగుణ వార్థి ఇప్పటి విద్యార్థి ॥వి॥

434

క్లాసు పుస్తకమ్ము కంటక మనిపించు
కథలబొక్కు చదువ గడగుచుండు
ఇట్టి సుగుణవార్థి ఇప్పటి విద్యార్థి ॥వి॥

435

కలిమి గలుగువారు కట్నాల కోసమే
చదువువారు కాని చదువు లేల ?
కట్నమంచు జెప్పు కాలేజి పాఠాలు ॥వి॥

436

ప్రేమ నందనమ్ము పెళ్ళిళ్ల సంఘమ్ము
చలనచిత్ర మందిరాల కర్చు
నేతిబీరకాయ నేటి చదువులు మాయ ॥వి॥

437

గురువు కూలివాడు గురువు శిక్షవాడు
గురువు బేరగాడు గురువు దొంగ
గురుతు లేకపోయె గురువన్న మాటకు ॥వి॥

438

కాంతమీద చూపు కనకమ్ముపై చూపు
మనసు కలుగుచుండు మధువుపైన
గురువుల మనువారి దరువు లిట్లున్నవి ఆ॥వె॥

439

కామ కాంత గనును కాషాయపు తెరల
మాటు ఋషుల దివ్య మాయవలన
గురువుల మనువారి దరువు లిట్లున్నవి ఆ॥వె॥

440

గుడుల గడుదుమంచు గుట్టుగా చందాలు
లాగి దానితోడ తాగు జనులు
యోగుల మనుచుంద్రు భోగ మరయుచుంద్రు ఆ॥వె॥

441

భజన లనుచు జెప్పి భక్తుల దగ్గర
ధనములాగి బ్రతుకు ఘనులు మునులు
యోగుల మనువారి రోగ మిట్లున్నది ఆ॥వె॥

442

ఆడువారి జేరి యాశీస్సులని చెప్పి
మాన మపహరింత్రు మాయజేసి
యోగుల మనువారి రోగ మిట్లున్నది ఆ॥వె॥

443

గడ్డము బహు పెంచి ఘనయోగి కాలేడు
కావి బట్టగట్ట కాడు మౌని
పైన మెరుగుజూచి భ్రమపడ నేల యా॥ ఆ॥వె॥

444

నాల్గు యుగళగీతములు నాల్గు యుద్ధాలు
ఒక్క బూతుపాట ఒక్క యేడ్పు
తెలుగు చలనచిత్రముల తెరంగిది యౌను ॥వి॥

445

అమెరికాలో దృశ్య మద్దంకిలోనుండు
ఊటుకూరి ప్రక్కనుండు నూటి
తెలుగు చిత్రసీమ తెరగేమి చెప్పుదున్ ॥వి॥

446

బెంగుళూరి కథలు బెజవాడ మనుషులు
తమిళ సంప్రదాయ తత్వముండు
తెలుగు చిత్రసీమ తెరగేమి చెప్పుదున్ ॥వి॥

447

తీసిన కథలెల్ల తీయుచుంద్రు మరల
మార్చి పేర్లు రంగు మార్చివేసి
తెలుగు చిత్రసీమ తెరగేమి చెప్పుదున్ ॥వి॥

448

ఉప్పులోన రాళ్లు పప్పులోపల రాళ్ళు
కలితిలేని దినుసు కానరాదు
ఇంత ఘోరమైన విప్పటి బేరాలు ॥వి॥

449

అరువు బేర మొకటి అసలు బేరమొకటి
కరువు బేరమొకటి కలదు చూడ
ఇంత ఘోరమైన విప్పటి బేరాలు ॥వి॥

## 450

నూనెలోక కలితి తేనెలోన కలితి
కలితి నేతిలోన కలదు చూడ
ఇంత ఘోరమైన వ్పటి విచేరాలు ॥వి॥

## 451

కలితి బియ్యమందు కలితి బెల్లమునందు
వెలితి కొలత లందు కలుగుచుండు
ఇంత ఘోరమైన విప్పటి వేరాలు ॥వి॥

## 452

కోకిల గళమందు కాకలీ ధ్వనియుండు
కొంగ కంఠమందు బొంగురుండు
రంగుకేమి యంతరంగ మెంచగవలెన్ ॥వి॥

## 453

ఎన్ని పంటలున్న నేమి లాభము లేదు
కరువు దీరదేమి కారణమ్ము
సరుకు వెదకిచూడు దొరకు పాతాళాన ॥వి॥

## 454

ఓటునడుగు నప్పుడొదిగి దండము పెట్టు
కాళ్ళుబట్టు కవికరాలు బుట్ట
ఓటుగొన్న పిదప నొడిసి లంచము బట్టు ॥వి॥

## 455

ఓటువేయ బోవు ఓటరు గారికి
బండి పోవునప్పుడుండు నండి
వచ్చునపుడు కాళ్ళు వాహనాలగు గదా ॥వి॥

456

రక్కసి ముకు చెవులు చెక్కెను లక్ష్మన్న
అతని నను ఘుడనుచు నంద రనిరి
అట్టి మాటవిన్న ననఘుడెట్లయ్యెనో ॥వి॥

457

ద్రోవది వలువలను దుశ్శాసనుక దూచ్చె
అతని దుష్టుడనుచు నంద రనిరి
అన్నమాట విన్న నఘమెట్లు గలిగెరా ॥వి॥

458

అన్నను వరికించి యాలంక నేలిన
ఆ విభీషణుండు ననఘుడయ్యె
అన్నను దునుమాడననఘు డెట్లయ్యెరా ॥వి॥

459

అన్న నుదును మాడనున్న వాలిని నాడు
దోషమెంచినారు దుష్టు డనుచు
ఆవిభీషణుండు నట్టి తమ్ముడె గదా ॥వి॥

460

దుష్టులనిరి కవులు దుర్యోధనాదులన్
దొసగు చేయనట్టి దొరలు వారు
ప్రజల బిడ్డలట్లు పాలించిరా ఘనుల్ ॥వి॥

461

చెల్లికి ముకుచెవులు చెక్కగ రాముని
భార్య సీతను చెరబట్టినాడు
రక్కసుడని కవులు రావణు దిట్టిరి ॥వి॥

462

జూద మాడుటందు ఆవరమ్ము జూపె
ధర్మరాజు దాన తప్పులేదు
ఆలిని ఫణమనుచు నత డొడ్డుటే తప్పు ॥వి॥

463

దితికి బుట్టినారు దైత్యులనెడివారు
అదితి బిడ్డలంత నమరులైరి
తల్లి లిద్దరైన తండ్రి యొక్కడె గదా ॥వి॥

464

జన్మనిచ్చె నొక్క జనకు డిద్దరికిని
అయ్యెనెట్లు రెండు నన్వయములు
కవులు చెప్పినట్టి కథలు గదా ॥వి॥

465

ఎవడు యముని తండ్రి ఎవడు కర్ణుని తండ్రి
ధర్మరాజుగారి తండ్రి యెవడు ?
వాని వరుసలేని వారెటు దేవతల్ ॥వి॥

466

పటము ముందుబెట్టి పలుమంత్ర పఠనమ్ము
జేసి గంటగొట్టి జేజివచ్చి
ఆరగించి వరము లందించునా యేమి ? ॥వి॥

467

గుళ్ళు గట్టిపైన గోపురమ్ములు గట్టు
మొద్దు రాళ్ళ ముందు మొకరిల్లు
పిల్లి కొక్క పిడుచ పెట్టకుండును గదా ॥వి॥

468

బందిపోట్లు వచ్చి బరిశలతో గ్రుచ్చి
ఇల్లు దోచుకొనిన నెవరు దిక్కు
పంత మెందుకయ్య పంచు నీ యాస్తిని ||వి||

469

ఊళ్ళు మునిగిపోవు ఉప్పెన వచ్చినన్
దాచియున్న ధనము లేచిపోవు
సంభయేచ్ఛ విడిచి పంచిపెట్టుట మేలు ||వి||

470

మంచి మాటలున్న మహిని గెలువ వచ్చు
మంత్రమగును మంచిమాట భువిని
మంచి మాటలున్న మనిషి మాధవుడౌను ||వి||

471

మాదిగలను జూచి మా దిగువ మనుషు
లనుచు బలుకుచుంట లగ్గు గాదె
మాదిగా యనియన మా స్వంతమని గదా ||వి||

472

మాలవారటంచు గేలి చేయగ నేల
అర్ధమేమి మాల యనుచు బలుక
మాల పూలమాల మరి జపమాలయౌ ||వి||

473

చంద్రమండలమును చయ్యన గనివచ్చు
వింత సాధనముల వెలయ జేసి
నరుడు విజయుడయ్యె నారాయణుండయ్యె ||వి||

474

దూరదర్శనమ్ము దూరశ్రవణముల్
తాపసులకె తొల్లి దక్కెనయ్య
నేడు మనిషి కిట్టి నేర్పు కలిగినదయ్యా ॥వి॥

475

విశ్వకర్మ లేని విశ్వంబు లేదనెడి
వేమరెడ్డి మాట వేదమగును
విశ్వమయుడవైన విభుడవు నీవయా ॥వి॥

476

పట్టుబట్టగట్ట పలలంబు భుజియించు
కావిగుడ్డ గట్టి కల్లుద్రావు
పాపి పదుగు రెదుట పలునీతులను బల్కు ॥వి॥

477

రాతిబండమీద రమణీయమగు దైవ
విగ్రహమును జెక్కి వేడ్కమీర
దానిపేరు మీద ద్రవ్యమ్ము గొందురు ॥వి॥

478

బండరాయియైన మొండిదేవున కిల
దండ మిడుదురయ్య దండవేసి
భక్తియోగమిట్లు బంగులయ్యెను గదా ॥వి॥

479

కోతి బొమ్మదెచ్చి కోవెలలో బెట్టి
ఆంజనేయుడనుచు నందు రవని
కోతి గానఃపింప కొట్టెద రేలయా ॥వి॥

480

ఏనుగు తల బెట్టి మనిషి బొమ్మను చేసి
గుజ్జువేల్పు పేర గొలుచుచుంద్రు
గజము గానుపింప గజ గజ లాడేరు ॥వి॥

481

ఏనుగు తలవాడు పూను వాహనమంచు
ఎలుక పూజ సేతురేమి మాయొ।
ఎలుకను వలలోన నిరికించి చంపేరు ॥వి॥

482

గుఱ్ఱము తలవాడు గొప్పదేవత గాని
కలియుగమ్ము నందు కలిగె ముప్పు
గుఱ్ఱమగుచు బండి గుంజు కర్మము బట్టె ॥వి॥

483

చేపమొండెమునకు శ్రీపతి శిరముంచి
మత్స్యమూర్తి యనుచు మనుచువారు
మత్స్యకోటి మాంసమందు రుచిని గంద్రు ॥వి॥

484

చీకపెదురు రాగ చింపి ముక్కలు జేసి
జేబుగుడ్డ పోలె జేసికొందు
బురద చుట్టివేయ పువ్వునై పుట్టెద ॥వి॥

485

వెన్నెల వెలుగులను మన్నన చేసెదన్
చీకటియన నాకు చిక్కుగాదు
వేకువ విలువేది చీకటిలేకున్న ॥వి॥

486

కోకిలమ్మ పాట కోరు కొందును నేను
గాడిద గొంతు విని గాసిపడును
బరువు మోసి బ్రతుకు ఖరము నా కిష్టమా ॥వి॥

487

నరకునంద జేసి సారాయి కొట్టుకు
మధ్య నిషేధమునకు మద్యమింప
తాగువాడు దొంగతనముగా త్రాగడా ॥వి॥

488

అడిగి పెట్టుకొన్న అష్టావధానాన
అష్ట కష్ట మంత ననుభవించి
అంతమందున గొను నర్థ నూటపదార్లు ॥వి॥

489

అరునెలల జీతమసలు రాకున్నను
చెప్పు కింద తేలు చిక్కినట్లు
అరవకుండ జెప్పు నయవారు పాఠాలు ॥వి॥

490

కవినటంచు బల్కి కవితలు వెలయించి
యాచనమున బ్రతుక జూచుకంటె
కష్టపడుచు మనిషి కడుపు నింపుట మేలు ॥వి॥

491

కాకులన్ని కలసి కట్టుగా భుజియించు
కుక్కలట్లుగాక కొట్టుకొనను
కాకిమూకవోలె కలిసియుండుట మేలు ॥వి॥

492

కుంటివార మనుచు గుడ్డివార మనుచు
పెచ్చుమీరినట్టి బిచ్చగాళ్లు
భరతమాత మేనిపైన నిలిచిన పుళ్లు ॥వి॥

493

కాళ్లుండి గూడ కన్నులుండిగూడ
కుంటి యంద్రు మరియు గుడ్డి యంద్రు
వాళ్ళు రైతురాజు వదలి పెట్టిన బీళ్ళు ॥వి॥

494

సుఖము మరిగినారు సోమరిపోతులై
కాయకష్టమందు కనరు మేల్మి
వాళ్ళు దేశమాత కళ్లలో కన్నీళ్ళు ॥వి॥

495

గేయమైన కర్ణపేయమైతే మేలు
వచనమైన నేమి రుచిగనున్న
హృద్యమైన నొక్క పద్యమ్ము చాలదా? ॥వి॥

496

విశ్వకర్మ నీదు విశ్వరూపమ్మును
చూచినాను దేవ చూచినాను
విశ్వమంత నీదు వివిధరూపుల నుండె
కాంచినాను దేవ కనుల పంట

497

నీశరీరమందు నిఖిల దేవతలను
చూచినాను దేవ చూచినాను
నీదుదేహమందు నిఖిల భూతాలను
చూచినాను దేవ చూచినాను

498

నీశరీరమందు నే బ్రహ్మ దేవుని
కాంచినాను దేవ కాంచినాను
నీదు రూపమందు నెల్ల ఋషీశులన్
చూచినాను దేవ చూచినాను

499

దివ్యదేహమందు దివ్య సర్పములను
చూచినాను స్వామి చూచినాను
వేయి హస్తములను వేయి ఉదరముల
వేయి వదనములను వేల కనుల

500

వేయి శిరసుల మరి వేయి కిరీటాల
శంఖ చక్రములను శార్ఙ్గములను
కాంతిపుంజములతొ ప్రకాశించు తనువు
అగ్నివోలె వెలుగు నట్టిరూపు

501

వేయి సూర్యులట్లు వెలిగెడి నీమేను
అది అంత మెరుగనట్టి మేను
ధర్మ రక్షకు నిను ధర్మమూర్తిని నిన్ను
చూచినానుదేవ చూచినాను

502

అక్షయుండ వీవ ఆదిమధ్యాంతుడ
వగ్నిహోత్రమువలె నలరినావు
వింగి నేల నడుమ నిండియుంటివి దేవ
నేను నిన్ను జూచినాను స్వామి

503

భయము గొల్పుచుండె భవదీయ రూపమ్ము
పడెను ముజ్జగమ్ము భయమునందు
దేవ గణము నీదు దేహమ్ము లోనికి
దూరుచుండె భయము దోచుచుండె.

504

తెరచినట్టి నోరు తెరచిన నీ కనుల్
రంగు రంగులు గల యంగమంత
అగ్నిగోళములగు అక్షి ద్వయమ్మును
కాంచినాను స్వామి కాంచినాను.

505

కోరలు గలయట్టి క్రూరమౌ నీమోము
లోనికేగుచుండ్రి లోకులంత
దంష్ట్రలందు జిక్కి తలలు నలిగినట్టి
వారి గాంచినాను వారిజాక్ష.

506

వాహినీ తతి యల వారాశి లోపల
కలిసినట్లు జనులు కలిసిరయ్య
అగ్నిలోన మిడత లన్ని దూకినయట్లు
మండుచున్న నోట ద్రమ్మగినారు.

507

ఎవ్వరయ్య నీవు యెరుగ జేయుము దేవ
ఏమి నీదు భావ మేమి దేవ
ఆదిదేవ దేవ అర్థించుచుంటిని
ఏమి నీదు రూప మేమి దేవ.

508

ఎప్పు డీ భువి సయి కెట్లు వచ్చెదవయ్య
వీరభోగి యనెడి పేరు గలిగి
ఎల్ల విషయములను తెల్లమ్ము జేయవా
విశ్వ ధర్మ మర్మ విశ్వకర్మ.

509

కువలయమ్ము నందు కుల మత భేదాలు
కలుగనట్టి రోజు కలుగుగాక
ధరణియందు ప్రజలు ధర్మమ్ము తప్పక
కలిసి బ్రతుకు రోజు కలుగుగాక।

510

గాలి నేల నీరుగా గల్గు ప్రకృతి
వనరులెల్ల జనుల వశము లగుచు
సామ్యవాద రథము సాగివచ్చునుగాక
పంట మూడు కార్లు పండుగాక

511

ప్రకృతి యణు వణువును సుకృతి యగునుగాక।
మనిషి యగునుగాక మాధవుండు
అవనిలోని ప్రజల కానందమగు గాక
విశ్వ ధర్మ మర్మ విశ్వకర్మ।

విశ్వశ్రీ ఆర్టు ప్రెస్, నరసరావుపేట.

# కన్నెకంటి రాజమల్లాచారి

## పరిచయం

జననం: 1944.

అభిజనం: పల్నాడు తాలూకాలోని తక్కెళ్ళపాడు గ్రామం

జననీ జనకులు: కన్నెకంటి సుబ్బమ్మ, చినలింగయ్యాచార్యులు

ప్రాథమిక విద్య: గురజాల

ఉన్నతపాఠశాల: మాచర్ల

కళాశాల విద్య: నరసరావుపేట S. S. N. కళాశాల

స్నాతకోత్తరవిద్య: భాగ్యనగరం. ఉస్మానియా విశ్వ విద్యాలయం ప్రథమశ్రేణి ఉత్తీర్ణత

ప్రస్తుతం మార్కాపురం, S. V. K. P. కళాశాలలో అధ్యాపకత్వం - నాగార్జున విశ్వ విద్యాలయంలో పార్ట్‌టైమ్ స్కాలర్‌గా డా॥ టి. నిర్మలగారి పర్యవేక్షణలో "A Critique on Potuluri Veerabrahmam and his works" "పోతులూరి వీరబ్రహ్మంగారి జీవితం - రచనల పరిశీలన" అనే అంశంపై పరిశోధన,

"నందికొండ, పృథ్వీరాజు (నాటకం). యమునాతీరం" హరివిల్లు, కవితా కల్లోలిని (నవల), అలలు కలలు, పూలదోసిళ్ళు. మొదలైన గ్రంథాల రచన.

అభిమాన విషయాలు: సంగీత, సాహిత్యాలు.

బిరుదాలు: విద్యావిశారద, సాహిత్య సరస్వతి.

విశ్వశ్రీ ఆర్ట్ ప్రెస్, నరసరావుపేట.